# ప్రశ్నార్థకాలు

కవితా సంపుటి

## తాళ్లపల్లి మురళీధర గౌడు

ప్రచురణ :

రిజిష్టర్ సంఖ్య 1/64

**యువభారతి**

**సాహితీ సాంస్కృతిక సంస్థ**

**తిలక్‌రోడ్, హైదరాబాదు - 500 001.**

PRASHNARTHAKALU (Question Marks)
An anthology of Free Verse by
Tallapally Muralidhara Gowd

యువభారతి ప్రచురణ సంఖ్య : 153
(సెల్ఫ్ ఫైనాన్సింగ్ స్కీం)
ప్రథమ ముద్రణ : అక్టోబర్ 1994
ముద్రణ :
పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్
1-1-517/బి/1, న్యూ బాకారం
గాంధీనగర్, హైదరాబాదు - 500 380
ఫోన్లు : 611413, 600547
ముఖచిత్రం : శ్రీ శీలా వీర్రాజు
ముఖచిత్ర ముద్రణ :
శ్రీ బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్
చిక్కడపల్లి, హైదరాబాదు - 500 020
ఫోన్ నెం. 638326
ప్రతులకు :
యువభారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు
తిలక్‌రోడ్, హైదరాబాదు - 500 001
లేదా
శ్రీమతి తాళ్లపల్లి అరుంధతి
ఇ.నెం. 1-1-189/15, వివేక్‌నగర్,
చిక్కడపల్లి, హైదరాబాదు - 500 020.
వెల : రు. 30/-

తెలుగు విశ్వవిద్యాలయం ఆర్థిక సహాయంతో ప్రచురితం.
ఈ గ్రంథంలోని రచయిత అభిప్రాయాలతో తెలుగు
విశ్వవిద్యాలయానికి ఎలాంటి సంబంధం లేదు.

అమృతాత్ములూ

ఆత్మీయతా మూర్తులూ

జన్మనిచ్చిన జననీజనకులకు

కృతజ్ఞతలతో

# మూడు పదుల యువభారతి

## మూడు ఆశయాలు :

సమాజ శ్రేయస్సుకు సమున్నత ప్రమాణాలు గల సాహిత్యం, ఉత్తమ మూల్యాలను పెంచి పోషించగల సహృదయ లోకం అవసరమని గుర్తించి, ఆ రెండింటినీ బలంగా పెంపొందించే సాహిత్య సాంస్కృతిక సామాజిక చైతన్యాన్ని కలిగించటానికి యువభారతి ఉద్యమిస్తున్నది.

సాహిత్యం ఎటువంటి సాహిత్యేతర శక్తుల అజమాయిషీకి లోనుగాకుండా స్వతంత్ర వ్యక్తిత్వంతో సాత్త్విక శక్తిగా రూపొందాలనీ, అటువంటి సాహిత్యాన్ని సృష్టించే రచయితలు ఏ కాలం వారైనా, వారి కృషినీ, సందేశాన్నీ సామాన్య ప్రజానీకానికి అందేటట్లు వివిధ ప్రచురణలద్వారా, కార్యక్రమాల ద్వారా యువ భారతి యత్నిస్తోంది. అంటే - రాజకీయ కాలుష్యం లేని సాహిత్యోద్యమాన్ని యువభారతి అవిశ్రాంతంగా సాగిస్తోంది!

''చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటె, ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నైనా వెలిగించటం మంచిది'' - అనే లక్ష్యంతో సమాజంలో వ్యష్టిగా, సమష్టిగా శాంతియుత సహజీవనాన్నీ. ప్రజా స్వామ్య విధానాన్నీ, నిర్మాణాత్మక కార్యశీలాన్నీ, మానవత్వపు విలువలతో కూడిన సేవాభావాన్నీ ఆచరించి చూపిస్తోంది యువభారతి!

## సాహితీసంస్థగా ముందడుగు :

రాజకీయాల స్వార్థకాలుష్యాలకు అతీతంగా ఉండగలిగే విశ్వజనీనమైన సాహిత్య స్పృహను సమాజంలో జాగృతం చేసి, తెలుగు సాహిత్యాభిమానాన్ని ఇంటింటా జ్యోతిలా వెలిగించాలనే ప్రయత్నంతో యువభారతి ముప్ఫైయేళ్లుగా ఉద్యమాన్ని సాగిస్తోంది. సమాజంలో ఉత్తమ సాహిత్యం పుట్టటం ఒక వంతు; దానిని ప్రజల మధ్యకు తీసుకొనిపోయే ప్రయత్నం మరొక వంతు. చదువుకున్న ప్రతివారూ తెలుగు సాహిత్యంలో వెలువడిన అంటే వారి మాతృభాషలో వెలు వడిన - సాహిత్యం చదవాలి. లేదా, కనీసం ఆ సాహిత్యం గురించి పరిచయం చేసుకోవాలి. అప్పుడే తెలుగుసాహితి సమాజంలో సజీవంగా ప్రవహించటానికి వీలుంటుంది. ఒక జాతిలో రచయిత (త్రు)లు పుట్టటం ఎంత గొప్పో, సహృద

యులు అధిక శాతంలో అభివృద్ధి చెందటం కూడా అంతే గొప్ప. సాహిత్యంలోని ఉత్తమ విలువలను గుర్తించి, గౌరవించే సహృదయ లోకాన్ని సాహితీ వాతావరణాన్ని సమాజంలో నిర్మించటంలో సాహితీ సాంస్కృతిక సంస్థల పాత్ర విశేషంగా ఉంది. ఆ బాధ్యతను గుర్తించి యువభారతి ఇన్నాళ్లుగా సాహిత్యోద్యమాన్ని సాగిస్తున్నది. ప్రజల హృదయాలలో తన ముద్రను పదిలంగా వేసుకున్నది.

## యువభారతి జీవితం ఒక సాహిత్యోద్యమం :

యువభారతి 1963 సం॥ విజయదశమినాడు పుట్టింది. మొదటి రెండేళ్లూ రూపుదిద్దుకున్నది. ప్రతి నెలా మొదటి, మూడవ ఆదివారాలలో సమావేశమై యువభారతీయులు మూడుగంటలసేపు మానవ సమగ్ర వ్యక్తిత్వ నిర్మాణానికి తోడ్పడే కార్యక్రమాలను నిర్వహించుకునేవారు. వక్తృత్వాన్నీ, రచనా పాటవాన్నీ, ఆలోచనాశక్తినీ, అధ్యయనశీలాన్నీ అలవరచే క్లుప్తగోష్ఠి, పుస్తకచర్చ, కవితాపఠనం, సమాలోచనం మొదలైన అంశాలను చైతన్యవంతంగా నిర్వహించుకునేవారు. అప్పటి సమావేశాలన్నీ సాహితీ శిక్షణ శిబిరాలుగా ఉండేవి. 1965 విజయదశమి నాటికి యువభారతి ఒక సమగ్ర రూపం తాల్చింది.

1965-70 సంవత్సరాల మధ్య యువభారతి తన ఆశయాలకు అనుగుణంగా సాహిత్య కార్యక్రమాలను చేపట్టి ప్రజలమధ్యకు నడిచింది. బలమైన ప్రయోగాలను చిత్తశుద్ధితో చేసి ప్రజల మన్ననలను పొందటం ప్రారంభించింది. యువభారతి ప్రచురణలు, సదస్సులు ఒక ప్రత్యేకతతో తెలుగువారిని ఆకర్షించటం ఆరంభించాయి. అనుముల కృష్ణమూర్తిగారి 'సరస్వతీ సాక్షాత్కారం,' కాళోజీగారి 'జీవనగీత,' యువభారతీయుల కవితా సంకలనం 'వీచికలు' తక్కువ ధరకు ప్రచురణ పూర్వ విరాళ పద్ధతిలో వెలువరించిన తొలి ప్రచురణలు. 1970 లో 'మారుతున్న విలువలు: రచయితల బాధ్యతలు' అనే అంశం మీద నిర్వహించిన గోష్ఠి, దానిని 'రచన'గా ప్రచురించిన అనుభవం యువభారతికి కీర్తిప్రతిష్ఠలతోపాటు ఒక ప్రామాణికమైన సాహిత్య సంస్థకు వచ్చే గుర్తింపును గూడా తెచ్చిపెట్టాయి.

1971 - 1985 మధ్య యువభారతి సమాజంలో ఒక అపూర్వ సాహిత్య చైతన్యాన్ని కలిగించింది. యువభారతి వార్షికోత్సవాల 'లహరి ఉపన్యాస పరంపరలు' ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారిచ్చిన 'కావ్యలహరి' తో మొద

లయ్యాయి. 1981 లో వేలమంది సాహితీ సభలకు రావటం, సాహిత్యపు విలువలపట్ల సదవగాహన సమాజంలో ఏర్పడటం యువభారతి సాహిత్యోద్యమం కలిగించిన విలువైన చైతన్యం. కావ్యలహరి; కవితాలహరి, చైతన్యలహరి, వికాసలహరి, రామాయణసుధాలహరి, నవోదయలహరి, నవ్యసాహితీలహరి, ప్రతిభాలహరి, ఆలోచనాలహరి, సంస్కృతసాహితీలహరి, జగద్గురుసాహితీలహరి మొదలైన 'లహరి' ప్రచురణలు సాహితీలోకంలో మన్ననల నందుకున్నాయి.

భారత స్వాతంత్ర్య రజతోత్సవాలను పురస్కరించుకొని యువభారతి ప్రచురించిన నూరు వ్యాసాల 'మహతి' తెలుగు సాహితీ పరులలో ఒక విలువైన గౌరవాన్ని పొందింది; పరిశోధకుల మన్ననల నందుకున్నది. తెలుగు నవలలను గురించి ఇంగ్లీషులో చెప్పటానికి ప్రయత్నించిన 'Telugu Novel' మంచి ప్రయోగంగా ఆదరణ పొందింది. తెలుగులో కవుల కవితా వైభవాలను ప్రచురించే యువభారతి రచనలు ప్రాచీనాధునికాంధ్ర కవులను, భారతీయ భాషా కవులను సరళంగా వ్యాఖ్యానించి చెప్పాయి; చెపుతున్నాయి. యువభారతి ప్రచురించే ప్రతి ప్రచురణా ఆయా సమయాల్లో సమాజంలో కలిగించవలసిన సాహితీ స్పృహను దృష్టిలో ఉంచుకొని రూపొందించేదే. కాలగతిలో అవిచ్ఛిన్నంగా సాగవలసిన సాహితీ రసికత్వాన్ని లహరిగా ప్రవహించేటట్లు కార్యక్రమాలను సాగించటం యువభారతి ప్రవృత్తి!

1991 - 1992 లో యువభారతి రజతోత్సవాలను జరుపుకున్నది. పద్మభూషణ్ ఆచార్య సి. నారాయణరెడ్డిగారు 'తెలుగు కవిత : లయాత్మకత' అనే అంశం మీద రజతోత్సవ ఉపన్యాస లహరిని అందించారు. అది గ్రంథరూపంగా వెలువడింది. నెలనెలా మొదటి ఆదివారం సాయంకాలం 5.30 గం॥లకు జరిగే "సమాలోచనం" సమావేశాలన్నీ రజతోత్సవాలలో భాగాలుగా మలచబడ్డాయి. 'ఈ దశాబ్దంలో తెలుగు సాహిత్యం' (1980 - 1990), 'పాతికేళ్ళ పత్రికా రచన' (1965 - 1990), యువభారతి రజతోత్సవ సంచిక 'వెండి వెలుగులు' 'అనుభూతి', 'అమృత రాజీవం' కవితా సంపుటాలు రజతోత్సవ ప్రచురణలుగా వచ్చాయి. రజతోత్సవాలలో భాగంగా జరిగిన సదస్సుల లోని ఉపన్యాసవ్యాసాల సంకలనాలను 30వ వార్షికోత్సవాల ప్రచురణలుగా వెలువరించటం జరుగుతున్నది. ఆలోచనలకు అక్షరాకృతి నివ్వటం యువభారతి సాహితీవ్రతం.

నేటి తెలుగు సాహిత్యంలో అత్యంత నవ్యభావ ధోరణులుగా వెలువడుతున్న స్త్రీవాదం, దళితవాదం సాహితీపరుల, రచయితల దృష్టిని బాగా ఆకర్షిస్తున్నాయి. పత్రికలలో ఆ ప్రవృత్తులమీద వ్యాసాలు విరివిగా వెలువడుతున్నాయి. ఆ అంశాలపై సరళంగా సహృదయలోకానికి పరిచయం చేయాలని యువభారతి తన సమాలోచన కార్యక్రమంలో భాగంగా 1993 ఆగస్టు 1 వ తేదీన ఒక గోష్ఠిని ఏర్పాటు చేసింది. దానిలో పాల్గొన్న ప్రముఖుల ప్రసంగ వ్యాసాలను ఒక ప్రచురణగా వెలువరించింది.

కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి శత జయంతి సంవత్సరం 1994 సెప్టెంబరు నుండి 1995 సెప్టెంబరు వరకు దేశమంతా సమధికోత్సాహంతో జరుపుకుంటున్నారు. మూడు దశాబ్దాలుగా తెలుగు సాహిత్యానికి సేవ చేస్తున్న యువభారతి విశ్వనాథ సాహితీ సమాలోచన సభలను ఈ సంవత్సరమంతా ప్రతి నెలా మొదటి ఆదివారంనాడు జరుపుతుంది. ఆ సాహితీయజ్ఞానికి ప్రారంభోత్సవం 1994 సెప్టెంబరు 4 వ తేదీన జరిగింది. ఈ సభలలో పాల్గొంటున్న సాహితీమూర్తుల ప్రసంగవ్యాసాలతో ఒహరీ పరంపరలో 'విశ్వనాథ సాహితీ సమాలోచనం' వార్షిక ప్రచురణగా 1995 సెప్టెంబరు 3 వ తేదీన యువభారతి వెలువరిస్తున్నది.

లోగడ యువభారతి ప్రచురణగా తమ తొలికావ్యమైన 'వెలుగురేఖలు'ను ప్రచురించిన ప్రముఖ యువకవి శ్రీ తాళ్లపల్లి మురళీధర గౌడు 'సెల్ఫ్ ఫైనాన్సింగ్ స్కీం' క్రింద ఈనాడు తమ రెండవకావ్యమైన 'ప్రశ్నార్థకాలు' అనే కవితల సంపుటిని కూడా మా సంస్థ ప్రచురణగా వెలువరిస్తున్నందుకు ఆనందిస్తున్నాం. పాతిక సంవత్సరాలుగా సాహిత్య క్షేత్రంలో కృషి చేస్తున్న శ్రీ గౌడుకు రెండు దశాబ్దాలకు పైగా యువభారతితో సన్నిహిత సంబంధముంది - బాధ్యతాయుత పదవులను నిర్వహిస్తూ అందరి మన్ననలనూ పొందినారు. యువభారతిలో కార్యకర్తలు మాత్రమేకాదు- కావ్యకర్తలు కూడా ఉన్నారనడానికి వీరు చక్కని నిదర్శనం. కవిత్వంలో అస్పష్టత, అనన్వయం లేని కావ్యం 'ప్రశ్నార్థకాలు'. తమ కవితా సంపుటిని ప్రచురిస్తున్న సందర్భంగా శ్రీ మురళీధర గౌడు గారిని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

యువభారతి నభిమానించే సాహితీ లోకానికి మా అభినందన చందనాలు.

జి. వి. సుబ్రహ్మణ్యం
అధ్యక్షుడు

హైదరాబాదు
20-10-1994

# నేపథ్యం

కడచిన పాతికేళ్లుగా సాహిత్యకృషి చేస్తున్న నేను వ్రాసిన కవితలు, గేయాలు, సాహిత్య వ్యాసాలు అనేకం. మన్నికైన కొన్ని కవితలు ఏర్చికూర్చి **1983 లో 'వెలుగు రేఖలు'గా** మొదటిసారి ప్రచురించాను. నా కవితా గురువులైన అమృత హృదయులు, మహాకవులు, 'అభినవ పోతన' డా॥ వానమామలై వరదాచార్యులుగారికి ఆ కావ్యాన్ని అంకితమిచ్చి ధన్యుడనయ్యాను.

దాదాపు ఒక దశాబ్దం తర్వాత నా రెండవ కావ్యాన్ని 'ప్రశ్నార్థకాలు'గా ప్రచురించి , జన్మనిచ్చిన జననీ జనకులకు అంకితమిస్తున్నందుకు ఆనందంగా వున్నా - కవికి ఇంత విరామం ఉండకూడదు. కాని వ్రాసిందల్లా కవిత్వం కాదు కనుక 'మంచి కవితలు అచ్చువేయాలి సుమా' అని కవిమిత్రుడు శ్రీ కృష్ణమూర్తి యాదవ్ లాంటి వాళ్లు పదే పదే అనడం వల్ల ఈ ఆలస్యం జరిగినమాట వాస్తవం. ఎవరి శైలినో అనుకరించక, ఎవరి ప్రభావానికీ లోనుకాక, నాదైన ప్రత్యేక శైలిలో వ్రాయడానికి ఈ మధ్యకాలంలో కృషి చేశాను. స్వీయకవితా సమీక్ష చేసుకున్నాను.

సాహిత్యం పట్ల మక్కువను కలిగించి, కవిగా జన్మనిచ్చిన కీర్తిశేషులు, మహాకవులు, మహామనీషులు డా॥ వానమామలై వరదాచార్యులు గారిని, డా॥ దాశరథి గారిని, డా॥ రావూరుగారిని, 'శశాంక' గారిని మరియు డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారిని తొలుత స్మరించడం నా విధిగా భావిస్తున్నాను. తమ అవ్యాజానురాగాన్ని కురిపిస్తున్న మా గురుపత్ని శ్రీమతి వైదేహి అమ్మగారికి ప్రణామాలు.

తమ గేయకథాకావ్యాల ద్వారా సాహిత్యం పట్ల అనురక్తుణ్ని చేసిన ప్రముఖ కవులు, జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీతలు, పద్మభూషణ్ ఆచార్య సి. నారాయణరెడ్డిగారు స్వల్ప వ్యవధిలోనే కావ్యాన్ని చదివి 'అభినందన' అందించినారు. వారికి నా ధన్యవాదాలు. నా సాహిత్య వ్యక్తిత్వాల పట్ల స్పందించి 'నాలుగు

మాటలు' పేరిట శుభాకాంక్ష లందించిన మధుర కవులు, ఆత్మీయులు డా॥ అందె వేంకటరాజం గారికి, ఇంగ్లీషులో Poet's Heart Beats అను చక్కని వ్యాసం వ్రాసి అభినందించిన ఎస్.బి. సైన్స్ కళాశాలలో మా ఆంగ్లోపన్యాసకులు శ్రీ పి. రాజారామ్మోహన్‌రాయ్ గారికి నమస్సులు.

నేను వ్రాసిన ఎన్నో కవితల్లోంచి మన్నికైన కొన్నింటిని ఎన్నిక చేయడంలో తమ విలువైన సమయాన్ని వెచ్చించడమే కాక, ఆమూలాగ్రం చదివి 'ప్రశ్నోత్తరాలు' పేరిట సమగ్రమైన, విలువైన పీఠికను వ్రాసిన ఆప్తులు' సహృదయ కవులు, విమర్శకులు - అంతకుమించి గురువర్యులు డా॥ తిరుమల శ్రీనివాసాచార్యులుగారికి సర్వదా కృతజ్ఞుడను.

ఈ కావ్యానికి 'ప్రశ్నార్థకాలు' పేరు పెట్టడానికి కారకులైన 'నెల నెలా వెన్నెల' కృష్ణారావు గారికి, తన విలక్షణమైన శైలిలో చక్కని ముఖచిత్రాన్ని గీసి యిచ్చి, ఓపికతో ముద్రణలో తగు సలహాల నిచ్చి తోడ్పడిన ప్రముఖ కథకులు, చిత్రకారులు, కవులూ శ్రీ శీలా వీర్రాజుగారికి ధన్యవాదాలు.

ఒక్కరోజులో కావ్యాన్ని అచ్చుతప్పులు లేకుండా అందంగా ముద్రించి, ఆశ్చర్యంలో ముంచెత్తిన పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్ అధినేత శ్రీ పి. శ్రీనివాస్ గౌడు గారికి, కూర్చిన కంపోజిటర్లకు, ప్రూఫులను చక్కగా దిద్దిన శ్రీ కె. పి. బాబు గారికి, బ్లాకులను అందంగా తయారుచేసి ఇచ్చిన మోహన్ ప్రాసెస్ అధినేత శ్రీ ఎం. జగన్మోహనరావు గారికి, ముఖచిత్రాన్ని ప్రత్యేక శ్రద్ధతో ఆకర్షణీయంగా ముద్రించి ఇచ్చిన శ్రీ బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్ యజమాని శ్రీ బి. బాలాజీప్రసాద్ గారికి, లామినేషన్ చేసి ముఖపత్రం అందాన్ని ఇనుమడింపజేసిన శాకాంబరి ఎంటర్ ప్రైజెస్ వారికి కృతజ్ఞతలు.

తెలుగు విశ్వవిద్యాలయం వారికి ఆర్థిక సహాయం కోసం దరఖాస్తు పెట్టేనాటి నుండి అచ్చుపని ప్రారంభించే వరకూ నా బద్ధకాన్ని దూరంచేస్తూ వచ్చిన ఆప్త మిత్రుడు, కవి శ్రీ ఏ. సూర్యప్రకాశ్ గారికి, పాక్షిక ఆర్థిక సహాయాన్ని ప్రకటించి నా ప్రయత్నాన్ని ప్రోత్సహించిన తెలుగు విశ్వవిద్యాలయం వారికి,

నా సాహిత్యోద్యమంలో పాలు పంచుకుంటున్న శ్రీ రాంచంద్రన్ ఆయిల్ ఇండస్ట్రీస్ మరియు స్వస్తిక్ వెజిటెబుల్ ఆయిల్ ప్రోడక్ట్సు లిమిటెడ్ వారికి ధన్యవాదాలు.

నా సాహిత్య కృషిని అభినందిస్తూ భూరి ఆర్థిక సహాయాన్ని అందించి నా కావ్యం వెలుగు చూడడానికి మార్గం సుగమం చేసి నా ఉత్సాహానికి ఊపిరి పోసిన సహృదయులు, వదాన్యులు ట్రాన్స్‌పోర్ట్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా లిమిటెడ్ అధ్యక్షులు శ్రీ ఎం.కె. అగర్వాల్ గారికి ప్రత్యేక కృతజ్ఞతలు. నాతో సహకరించిన స్నేహశీలి, ప్రముఖ మెజీషియన్ శ్రీ సామల వేణుగారికి మరియు శ్రీ సి. ఎస్. ఎస్. దశరథరాం గారికి ధన్యవాదాలు.

నా కవితా సృష్టికి మూల కారకులైన మిత్రులు, వరంగల్ ఆకాశవాణి కేంద్రం డైరెక్టర్ డా॥ పాలకుర్తి మదుసూదనరావు గారికి, నా కవితలనూ, వ్యాసాలనూ మొదటినుండీ ప్రసారం చేస్తూ ప్రోత్సహిస్తూ వచ్చిన ఆకాశవాణి వారికి - ముఖ్యంగా సర్వశ్రీ టి.వి.ఆర్.కె. సుబ్బారావు, కొత్తా మల్లికార్జునశర్మ, బి. జి. ఎస్. రావు, భీమయ్య గార్లకు మరియు శ్రీ సి.హెచ్. చలపతిరావు, శ్రీ మంత్రవాది సుధాకర్, శ్రీ సుధామ గార్లకు, దూరదర్శన్ వారికి - ముఖ్యంగా సహృదయులు శ్రీ వోలేటి పార్వతీశంగారికి, ప్రచురించిన ఆయా పత్రికాధిపతులకూ మరియు ప్రముఖ పాత్రికేయులు కీ. శే. అంజనేయశాస్త్రి గారికి, కీ. శే. ఎమ్మెస్ ఆచార్య గారికి, కీ.శే. కె. కాశీనాధం గారికి మరియు శ్రీ జి ఎస్. వరదాచార్యులు గారికి, శ్రీ రామనర్సయ్య గారికి, శ్రీ కాశీనాధుని సుబ్రహ్మణ్యం గారికి, డా॥ పోతుకూచి సాంబశివ రావు గారికి, శ్రీ కె. లక్ష్మారెడ్డి గారికి ధన్యవాదాలు.

ఈ కావ్యాన్ని యువభారతి సంస్థ ప్రచురణగా అచ్చువేయడానికి అంగీకరించిన యువభారతీయులకు - ముఖ్యంగా అధ్యక్షులు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం, సమావేశకర్త ఆచార్య వి. విశ్వనాథం, కార్యదర్శి డా॥ బి. జయరాములు, కోశాధికారి డా॥ జి. విద్యానాథ్ గార్లకూ మరియు ఆత్మీయులు శ్రీమతి కె. బి. లక్ష్మి, సర్వశ్రీ కె. వి. కామేశ్వరరావు, ఎస్. వెంకటేశ్వరరావు, ఎస్వీ. ప్రభాకరరావు, రెడ్డి రాఘవయ్య, ఎస్. పాండురంగారెడ్డి, డి. ఎల్. ఎన్. ప్రసాద్, ఎం. ఎస్. ఆర్. ఆంజనేయశర్మ, ఎ. రవీంద్ర గార్లకు మరియు యువభారతి

ఆఫీసు మేనేజరు శ్రీ కృష్ణమూర్తి గారికి నా నమస్సుమనస్సులు. ఉస్మానియా విశ్వవిద్యాలయ విద్యార్థిరచయితల సంఘం మిత్రులనూ, నెలవెలా వెన్నెల మిత్రులనూ మరచిపోలేను.

నా బాల్యానొక్క మధుర స్మృతిగా మిగిల్చిన మేనమామలనూ పెద్దమ్మలనూ సంస్మరించడం నా విధి. బాల్యంలోనే తలిదండ్రులు కన్నుమూయగా నన్ను చేరదీసి, విద్యాబుద్ధులు నేర్పించిన మేనమామ కీ॥ శే॥ బండిభీమా గౌడు గారికి; ఉన్నత విద్యలో చేయూతనూ జీవితానికింత వెలుగునూ అందించిన చిన్నాన్న కీ॥శే॥ తాళ్లపల్లి లక్ష్మణ గౌడు గారికి, వారి ధర్మపత్ని శ్రీమతి అంజనీ దేవిగారికి ధన్యవాదాలు. అమ్మను మరపించిన అమ్మమ్మను సంస్మరించకుండా ఉండలేను. నన్నొక ఇంటివాణ్ని చేసిన శ్రీ బి. విద్యాసాగర్ గౌడు దంపతులకు, ఆరంభంనుండి నన్ను ప్రోత్సహిస్తూ వస్తున్న శ్రీ ఆర్. లక్ష్మీనారాయణ గారికి, వ్రాసే ప్రతి ఉత్తరంలో సాహిత్య చర్చలు చేస్తూ నన్ను ప్రోత్సహిస్తున్న చక్కని విమర్శకుడు, కవి శ్రీ కె. నారాయణ గౌడు గారికి, నా ప్రతి రేడియో కార్యక్రమాన్ని క్రమం తప్పకుండా విని అభినందించే మిత్రులు శ్రీ వి. సత్య నారాయణ గారికి, శ్రీ ఆర్. రాజన్నగారికి మరియు సోదరుడు చి॥ ఆర్. జయ ప్రసాద్‌కూ, ప్రోత్సహిస్తున్న కవిమిత్రులు సర్వశ్రీ మామిండ్ల రామా గౌడు, ఊషా గౌడు, నిమ్మల అర్జున్ గౌడు, వేముల ప్రభాకర్, ఎం. కె. రాము, డా॥ ఆర్. వసునందన్, టి. లక్ష్మణ్ గౌడ్, డా॥ టి. లక్ష్మినరసింహ స్వామి గార్లకు మరియు సద్విమర్శకులు ఆచార్య ఎల్లూరి శివారెడ్డిగారికి కృతజ్ఞతలు. అన్నయ్య లేనిలోటును తీర్చిన నానన్నను ఎలా మరచిపోగలను!

నాకు సహాయ సహకారాల నందిస్తూ వచ్చిన శ్రీ ఎ. కృష్ణమూర్తి గారికి, శ్రీ వి.ఎల్.ఎన్. మధుసూదన్ గారికి ధన్యవాదాలు.

ఇంటి బాధ్యతలు నిర్వహిస్తూ నా రచనా వ్యాసంగానికి అడ్డురాని నా శ్రీమతి అరుంధతిని, చిరంజీవులు మహతి, కవితలను అభినందించకుండా వుండలేను.

నా జీవితంలో, సాహిత్య కృషిలో పాలుపంచుకుంటూ అనేక విధాలుగా సహకరిస్తున్న మిత్రులకు, సహృదయులకు అందరికీ హృదయపూర్వక ధన్యవాదాలు. పరిచయాలు, స్నేహాలు, సంబంధ బాంధవ్యాలు అన్నీ అవసరం మేరకే పరిమితమవుతున్న ఈ ఆధునిక యుగంలో, మనకు చేసిన మేలు మరచిపోకుండా కృతజ్ఞతలు చెల్లించడం కనీస మానవ ధర్మం కనుక ఇంత సేపూ మీతో ముచ్చటించి, నా సాహిత్య జీవిత నేపథ్యాన్ని వివరించాను. కృతజ్ఞతా భారంతో బరువెక్కిన గుండెను తేలికపరచుకున్నాను. ఈ కావ్యం ఇప్పుడు మీ చేతిలో వుంది. చదివి మీ అభిప్రాయాలు అందిస్తే సంతోషిస్తాను. సెలవు—

మీ



తేది : 27-10-1994

ఇం. నెం. 1-1-189/15
వివేక్ నగర్, చిక్కడపల్లి
హైదరాబాదు - 500 020

Jnanpith Awardee
Padmabhushan
**Prof. C. NARAYANA REDDY**
M A., Ph.D. D.LITT
Advisor to Government Culture and Language
Kala Bhavan, HYDERABAD - 500 004 (A P.)

# అభినందన

జీవితమంటేనే ప్రశ్నలపొది. ఎక్కుపెట్టి ప్రయోగిస్తుంటే అంతంత మాత్రాన లక్ష్యంలాంటి సమాధానం అందదు. ఈ కవితా సంపుటినిండా ఆ వాతావరణమే పరుచుకుని వుంది.

చాలాకాలంగా సాహిత్యక్షేత్రంలో నిరంతర సాధకుడు తాళ్లపల్లి మురళీధర గౌడు .1983 లో తన తొలి కవితా సంపుటిని ''వెలుగు రేఖలు"గా ప్రచురించాడు. ఇప్పుడు ''ప్రశ్నార్థకాలు'' సంధిస్తూ అగుపిస్తున్నాడు. మురళీధర్ ఎంత సరళంగా, ఉత్తమాశయనిబద్ధంగా జీవిస్తున్నాడో అతని కవిత్వం కూడా అందుకు అనుయాయిగానే వుంది. అస్పష్టత, అనన్వయం లేని ఋజుమార్గం ఇతను ఎన్నుకున్నాడు. 'ప్రశ్నార్థకాలు' శీర్షికతో పీడితవృత్తుల దయనీయస్థితిని మనముందుంచి మనలో ప్రశ్నార్థకాలను ముద్రిస్తాడు. 'బారాత్' శీర్షికతో మిరుమిట్లుగొలిపే పెట్రొమాక్సు వెలుగుల్లో, బాజాభజంత్రీల రొదల్లో సాగే పెళ్లి ఊరేగింపును వర్ణిస్తూ, అందుకు భిన్నంగా అదే ఊరేగింపులో పెట్రోమాక్స్ పట్టుకుని జీవచ్ఛవంలా నడిచిపోయే ఒక అభాగ్య స్త్రీ పరిస్థితిని వివరిస్తాడు. ఈ శీర్షికలోనే కాదు - ఈ కవితాసంపుటిలో అనేక సందర్భాల్లో ఈ వ్యత్యాసాన్ని ఎంతో పదునుగా ఎత్తిచూపాడు. బతుకుపాట శీర్షికలో రాసిన కవితలో ''మనిషిలోని దుఃఖం కూడా ఒక సముద్ర"మని అనడం లోతైన అభివ్యక్తి. ఈ కవితల్లో 'ఆధునిక నిర్వచనాలు'అనేది కాస్తభిన్నంగావున్న రచన. చమత్కారమే దీని గమ్యం. రకరకాల అంశాలపైన స్వీయనిర్వచనాలున్నాయి. సన్మానమంటే మురళీధర్ ఇచ్చిన నిర్వచనం నాకు బాగా నచ్చింది. కారణం - నా సాహిత్య యాత్రలో అది తరుచుగా తారసిల్లడమే.

చెప్పదలచుకున్నది మనసులో బాగా మననం చేసుకుని సగటు పాఠకుల మనసుకు సూటిగా ఎక్కేటట్టు రాసిన కవితల్ని ఈ సంపుటి రూపంలో వెలువరిస్తున్న చిరంజీవి మురళీధర గౌడుకు నా అభినందన.



హైద్రాబాదు
01-10-1994

Kavi Shiromani, Avadhana Yuvakesari
**Dr. ANDE VENKATARAJAM**
M A., Ph.D.
Rtd Lecturer in Telugu
KORATLA, Dt. Karimnagar (AP)

# నాలుగు మాటలు

'ప్రశ్నార్థకాలు' అనే కవితాస్త్రాలను ప్రయోగించిన శ్రీ తాళ్లపల్లి మురళీధర గౌడుగారు అచ్చమైన కవి. అసలైన మానవతావాది. వారి యీ కవితా సంపుటిని గురించి ఉగ్గడించడానికి ముందు వారి గురించి సంగ్రహంగా పరిచయం చేస్తాను.

శ్రీ మురళీధర గౌడుగారు ఆదిలాబాదు జిల్లాలోని లోనవల్లి గ్రామంలో శ్రీమతి సూర్యాబాయి, శ్రీ సాంబ గౌడుగారనే పుణ్యదంపతులకు నాలుగు దశాబ్దాల క్రితం జన్మించినారు. ప్రాథమిక విద్య తరువాత చెన్నూరులో ఉన్నత పాఠశాలలో చదివినారు. అప్పుడక్కడ అదృష్ట విశేషం చేత మహాకవి శిరోమణి, అభినవపోతన శ్రీమాన్ వానమామలై వరదాచార్యుల వారి గురుత్వం లభించినది. వారి ప్రశస్త విద్యాబోధనలో ఆంధ్రభాషా సాహిత్యాలలో అభినివేశం కలిగి, వారి వాత్సల్యామృత కలిత దివ్య శిక్షణలో చక్కని కవులై విలసిల్లినారు. పిమ్మట హైదరాబాదులో సర్దార్ పటేల్ కళాశాలలో బి. కాం. పట్టభద్రులైన కాలంలో సహృదయ విద్వత్కవివరేణ్యులైన డా॥ తిరుమల శ్రీనివాసాచార్యుల వారి అధ్యాపకత్వం, కవితా సాహిత్య ప్రోత్సాహం లభించినవి.

సహజ ప్రతిభావిభాసితులైన గౌడుగారు కుశాగ్రబుద్ధితో విద్యాభ్యాసం చేసి వ్యుత్పన్నులై, గురుజన శిక్షణలో కవితాభ్యాసం చేసి వందల కొలది కవితలు, సాహిత్యవ్యాసాలు రాసి, ప్రశస్తిగాంచినారు. పత్రికలలో ప్రచురితమై; ఆకాశవాణిలో, దూరదర్శన్‌లో వీరి రచనలు ప్రసారమైనాయి. వీరి కవితలు కుసుమశ్రీ, సుపర్ణ అనే మారు పేరులతో సాహితీ జగత్తును అలరించినవి. సికింద్రాబాదులోని

ట్రాన్స్‌పోర్ట్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా కంప్యూటర్ విభాగంలో ధర్మబద్ధంగా ఉద్యోగం చేస్తున్న వీరి ప్రవృత్తి సర్వాత్మనా సాహిత్యమే. ఏ పనిలో ఏ అవస్థలో ఉన్నా ఒక భక్తుని చిత్తం సర్వదా భగవంతునిపై ఉండునట్లే గౌడుగారు ఉద్యోగ ధర్మ నిర్వహణలో ఉన్నా, సంసారసాగర మీదుతున్నా, లోకవ్యవహార విహారియైనా వీరి జీవితం ప్రధానంగా సాహిత్యమే కేంద్ర బిందువై సంచరిస్తూ తేజరిల్లు తున్నది. వీరు కవులు విమర్శకులే కాక సాహిత్యసేవా ధురంధరులు. యువ భారతికి సంయుక్త కార్యదర్శులై దాని అభ్యున్నతికి విశిష్ట సేవలు అందిస్తున్న కార్యశూరులు. వీరు గతంలో 1983 లో 'వెలుగు రేఖలు' అనే వచన కవితా సంపుటి ప్రచురించి కవిపండిత విమర్శకుల మన్ననలు గాంచినారు. ఆ సంపుటిని గురువర్యులు శ్రీ వరదాచార్యుల వారికి భక్తితో అంకితం చేసినారు.

మురళీధర గౌడు గారిది పరమ ప్రశస్తమైన వ్యక్తిత్వం. అదుపు పొదుపు లతో జీవనరథం సాగించే అమృత హృదయులు. పరోపకార పరాయణులు. స్నేహశీలురు. కల్లాకపటం లేని అద్దం వంటి మనస్సు, హితమితఋతాంచితమైన వచస్సు, సాహితీ సౌరభ రమ్యమైన కార్యతపస్సు వీరి విశిష్ట వ్యక్తిత్వాన్ని విరా జిల్ల జేసినవి. సాహిత్యలోకంలో ఎందరిని ప్రోత్సహించినారో, ఎందరికి మార్గ దర్శనం చేసినారో, ఎందరికి చేయూత నిచ్చినారో లెక్కలేదు. మంచికి వెన్నవలె కరగిపోయే వీరు చెడుకు అధర్మానికి అక్రమాలకు వజ్రం పలె కఠోరులౌతారు. పీడిత తాడిత దీన హీన జనులను చూసి కంటతడిపెట్టే వీరు దుష్టులను భ్రష్టు లను చూసి ప్రళయ రుద్రులౌతారు. ఇవన్నీ ఒక సుకవి లక్షణాలు.

'ప్రశ్నార్థకాలు' కవితా సంపుటి ఈ కవి వ్యక్తిత్వానికి సదాశయాలకు దర్పణంగా ఉన్నది. మెప్పైన ముప్పది కవితలు దీనిలో పొందుపరచబడినవి. అన్నీ సామాజిక స్పృహ కలవే. ఒక్కొక్క కవిత ఒక కళాఖండమై రమణీ యంగా ఉన్నది. సమాజంలోని అన్యాయాలను అక్రమాలను చూసి బాధపడి మంచికోసం మానవత కోసం పడిన ఆరాటం పోరాటం వీటిలో ప్రస్ఫుటమౌ తున్నవి. ఎంత శ్రమ చేసినా తగిన ఫలం లభించక అణగారిపోయే బడుగు శ్రామికుల బ్రతుకులు నిత్యప్రశ్నార్థకాలని 'ప్రశ్నార్థకాలు' కవితలో వ్యధ చెందినారు. 'ఇది నా దేశమేనా?' 'దేహం - దేశం' వంటి కొన్ని కవితలు దేశ భక్తికి చెందినవి. 'రెండు శోక తీరాల మధ్య', 'నైజం', 'అవివేకి', 'కాలమా!'

వంటి కవితలు తత్త్వగర్భితాలై యొప్పుతున్నవి. 'పల్లె నా గుండె', 'బతుకు పాట' మున్నగు కవితలు పరమ ప్రశస్తంగా ఉన్నవి. 'ఆధునిక నిర్వచనాలు' కవిత వ్యక్తుల యొక్క, విషయాల యొక్క ఈనాటి వింత పోకడల గురించి విలక్షణ భాష్యం చెప్పి నవ్వించడమేకాక, చురక లంటించి హితోపదేశం చేస్తున్నది. ఇక 'మానవతకు మణి మకుటం' అన్న కవిత సంపుటిలో మకుటాయమానంగా ఉన్నది. దీనిలో సమాజంలోని దారుణ స్థితిగతులు వర్ణించబడి, ఆలోచనాత్మకంగా సాగినవి. ఈ విధంగా కవితలలో దేశభక్తి, జాతీయత, తాత్త్వికత, సామాజికస్పృహ, నైతికత, మానవతావాదం, సామ్యవాదం నిండుగా మెండుగా ఉన్నవి. అస్పష్టత క్లిష్టత లేని ఈ కవితలు ఉత్కిరమ్యంగా, ఉజ్జ్వలంగా సాగినవి. చక్కని శబ్దార్థపరిపుష్టి చెలగి రసభావోదంచితమై ఆనందంతోపాటు ధర్మోపదేశం అందిస్తున్న ఉత్తమ కవితలివి.

నా కాత్మీయులు, ఆప్తులు, చిరకాల మిత్రులు ఐన మురళీధర గౌడుగారు ప్రేమాదరాలతో నాలుగు మాటలు వ్రాయమన్నందుకు ఆనందిస్తూ అభినందిస్తున్నాను. వీరింకా రసభావోదాత్తాలైన అనేక రచనలు చేసి, ఆంధ్రభారతిని అర్చించవలెనని శుభాకాంక్షలు.

కోరుట్ల
భావ విజయదశమి
14-10-1994

SRI P. RAJA RAM MOHAN ROY, (M.A.)
Head Dept of English
N B Science College, HYDERABAD.

# POET'S HEART BEATS

Our relation - a student teacher relation - a kind of blood relation with Muralidhar today celebrates the year of Silver Jubilee. Today as a committed and challenging poet he is the pride of a Teacher. I feel simply overwhelmed with the honour he has conferred on me.

The slender volume of Free Verse 'PRASHNARTHAKALU' is a mirror of the grim realities of the modern urban life. His poetry is a Picture gallery - covers a broad canvas of all situations in the society. The under-current of his themes is the cannibalistic culture of a man eat man. He dips his pen in the sweat and blood of the underdog agonies The air - conditioned nightmare of the modern man is haunting every syllable of his writings. His imagination is fired with every kind of suffering, exploitation, injustice etc.

His outbursts and his heart beats are the volcanoes of the hungry and angry millions. But he never loses his temper. He is a people's poet with peace and non - violence as his missiles. His poetic analysis of the problems is clinical but not cynical He is a dreamer of one world family. He is a visionary of a utopia of prosperity, peace and love for all.

My above impressions are prompted by the following finely chiselled pieces In 'Question Marks' and 'we are the cursed' the poet's hero is the unsung and unwept rustic of the village It reminds me very surprisingly Thomas Grey's 'Elegy written in a country church yard'. In another poem 'Baraat' the pageantry of the wedding the petromax bearer 'Yadamma' Fainting with gruelling poverty is heart rending picture In the 'City of Four hundred years' the Greater Hyderabad is like Wordsworth's 'London' with its underworld of wailing maids and dons of flesh trade. In 'Jungle of People' city is a symbol of personified cruelty with high rise mansions juxtaposed with low lying huts His 'definitions' is nothing but today's contradictions, ironies, vanities etc.

The nostalgic poem on 'The Village' shows him as the son of the soil. The smiling village is no more there, the flames of hatred pain the poet Here also the poet reminds of Goldsmith's 'Deserted Village'. In the poems 'Is this my Country' and 'New Signatures' like Rabindranath Tagore, he gives a design for building a new Social Order where the world is without fear, narrow walls and where the head is held high.

On the whole his Poems are warning to the prophets of doom; a warning against converting the World into a graveyard and conducting the funeral of humanism

18-10-1994

Dr. TIRUMALA SRINIVASACHARYA
M.A., Ph.D.
Reader & Head Dept of Telugu
SARDAR PATEL College SECUNDERABAD

# ప్రశ్నోత్తరాలు

కవి మిత్రులు శ్రీ తాళ్లపల్లి మురళీధర గౌడు గారు, కలం పట్టిననాటి నుంచి, మానవతా మురళీ మధుర మనోజ్ఞరాగాలను ఆలపిస్తూ, సమ సమాజ నిర్మాణాసక్తినీ దీన మానవ సముద్ధరణ గాఢాభిలాషనూ వ్యక్తం చేస్తూనే ఉన్నారు. ఆచరణీయమైన జీవన మూల్యాలను సూచిస్తూ లలితమైన తమ శైలిలో సామాన్య మానవుని సగటు జీవుని సముజ్జ్వల భవిష్యత్తును ఆకాంక్షిస్తూ 1983 లో 'వెలుగు రేఖలు' సంపుటిని సమాజానికి అందించి వేడి వెలుగులను పంచి సహృదయుల ప్రశంసలకు పాత్రులైనారు.

మురళీధర గౌడు గారికి గణంమీద కంటే గుణంమీదే దృష్టి. వారికి రాశికన్న రమ్యతే ఇష్టం. అందుకే ఈ రెండవ సంపుటి 'ప్రశ్నార్థకాలు'ను పదేళ్ల తరువాత ప్రచురించి ప్రకటిస్తున్నారు. ఈ సంపుటిలోని ముప్పై వచన కవితా ఖండికలు మార్చి 1988 నుండి ఏప్రిల్ 1994 మధ్య అంటే ఆరు సంవత్సరాలలో రచించినట్టివి. కవితల ఎన్నికలో కవి చూపిన జాగరూకత గమనీయం.

ప్రతి మానవుని జీవితం ప్రశ్నోత్తర సంభరితం. ప్రశ్న బీజంలా సంక్షిప్తమైతే ఉత్తరంమాత్రం వృక్షంలా సమున్నతం. ప్రశ్న సూత్రంలా సూక్ష్మమైతే సమాధానం వస్త్రంలా విస్తృతం. ప్రశ్న పల్లవి అయితే సమాధానం చరణాల్లా అల్లుకు పోతుంది. పైన- సంపుటి శీర్షికను జిజ్ఞాసువులా ప్రశ్నార్థకం చేసి, సంపుటిలోని కవితల్లో సమదర్శిగా సమాధానాలిచ్చారు మురళీధరగౌడు గారు. ఈ నాటి మానవ జీవితంలోని నీడలూ వెలుగులూ ఈతని ఈ కవిత్వం నిండా కనిపిస్తాయి. అందుకే ఈ సంపుటిలోని కవిత ఒక ప్రశ్నోత్తరమాలిక.

ఈ కవి కరుణార్ద్రహృదయుడు. కన్నీటి విలువ తెలిసినవాడు. పీడిత ప్రజల దుఃఖాన్ని తన హృదయ సముద్రంలో 'బడబాగ్ని'లా దాచుకున్నాడు.

అంతటితో ఆగకుండ సత్త్వమూర్తియై ప్రజాకవిగా 'కలంతో పోరాటం' సాగిస్తు న్నాడు. 'హృదయ రుద్రవీణ'ను మీటి కవితాధారను వర్షిస్తున్నాడు. 'విప్లవదీపం' వెలిగిస్తూ వైతాళికుడై కాంతికవాటాలు తెరుస్తున్నాడు.

ఈ కవి స్నేహశీలి. తన స్నేహహస్తాన్ని చాచి 'సజీవజీవనస్రవంతిలో కలిసి నడుద్దాం' అని సాటిమానవులను ఆహ్వానిస్తూ వారి సమాగమనాన్ని సహజీవ నాన్ని ఆకాంక్షిస్తున్నాడు.

దేశానికి వలెనే ఈ కవికి గుండె పల్లెనే. పల్లెఒడిలో ప్రకృతి బడిలో స్వచ్ఛంగా సత్యంగా మాటా పాటా నేర్చుకున్నాడు; కూర్చుకున్నాడు. అందుకే నగరంలోని నైల్యాన్ని నిరసించాడు. స్వార్థపు రంగులు పులుముకొని, అగ్ని గుండంలా మారిన ఈనాటి పల్లెగుండెకు కూడా శస్త్రచికిత్స జరగాలని నిర్ధా రించాడు.

మనిషిలోని దుఃఖం కూడా ఒక సముద్రమని తెలుసుకున్న విజ్ఞాని ఈ కవి. అందుకే ఈ సంపుటిలోని బాషనిండా జనఘోష ధ్వనిస్తుంది.

ఆధునిక జీవితంలో అనౌచిత్యం చోటు చేసుకున్నందు వలన కొన్ని పదాలకు సంక్రమించిన విపరీతార్థాలను పరిచయం చేశారు గౌడుగారు 'ఆధునిక నిర్వచనాలు' ఖండికలో. సాంఘిక పరిణామాన్ని నిత్యజాగృతి శీలంతో పరిశీ లించే ఈ కవి వైఖరికి ఈ కవిత ఒక నిదర్శనం.

శ్రీ మురళీధర గౌడుగారు ఆశావాది. సాటి మానవుని భవిష్యత్తు సముజ్జ్వ లంగా శాంతిమయంగా ఉండాలని కోరుకునే విశ్వజనహితైషి. అందుకే మనిషి జీవితంలో "ఉషస్సు ఒక భ్రాంతి కారాదు" అంటూ కొత్త గాయకునిలా మానవ గీతాన్ని గానం చేశారు. "దానవతను రూపుమాపి మానవతను" పల్లకి నెక్కిం చాలనీ, "తరతరాలకు చెరిగిపోని సరికొత్త చరితను" సృష్టించాలనీ తమ ఆకాంక్షను అభివ్యక్తం చేశారు ఈ సంపుటిలో కవి.

సమకాలిక సమాజ దౌర్భాగ్యాన్ని కళ్లకు కట్టినట్లుగా చిత్రించి, దాని సౌభాగ్యానికి మార్గం చూపారు మురళీధర గౌడుగారు. నిస్వార్థ కష్టజీవులు 'నిత్య ప్రశ్నార్థకాలు,' 'వాళ్లు వాళ్లకే ఆశ్చర్యార్థకాలు' అని వర్ణించి, మానవత్వంతో వాళ్లను మనుషుల్లా చూడడమే అందుకు సరియైన సమాధానమనీ అదే వాళ్ల ఆకాంక్ష అనీ వివరించారు కవి. అమాయికులైన సామాన్యులను పావులుగా

ప్రచారసాధనాలుగా వాడుకొని, చిట్టచివరకు వాళ్లను మరిచిపోయే వంచకులనూ మానవత్వానికి అంత్యక్రియలు చేస్తున్న భ్రష్టులనూ దుష్టులనూ నిరసించాడు ఈ కవి. మనిషి మాన ప్రాణాలతో వ్యాపారం సాగించే హీనకృతక నగర జీవన విధానాన్ని గర్హించాడు - 'జనారణ్యం' 'భయారణ్యం,' 'బతుకుపాట' వంటి ఖండికలలో ఈ కవి. నాలుగుశతాబ్దాల చారిత్రక నగరమైన భాగ్యనగరాన్ని చూసి బాధపడ్డాడు; సిగ్గుపడ్డాడు ఈ కవి కారణం - ఇక్కడ నరుడు నరుడుగా జీవించనందుకు; మతం రక్కసి వేటుకు మనుష్యులు బలి అవుతున్నందుకు; గుడిసెలూ మేడలూ పోటీపడి పెరుగుతున్నందుకు, కన్నె గులాబీల అమ్మకాలు సజావుగా సాగిపోతున్నందుకు. మహారాష్ట్ర భూకంప బీభత్సంలో మానవత్వం మరోసారి విలవిలలాడినందుకు కరిగి కన్నీరైపోయాడు ఈ కవి. స్పందించే డెందం ఉన్న కవి కన్నీరు విడువక తప్పదు; కలాన్ని ఝుళిపించక తప్పదు.

ఈ సంపుటిలోని 'బారాత్', 'మృత్యువు ఒక విరామ గీతం' అనే ఖండికలు ఈ కావ్యకర్తకున్న దృశ్య ప్రత్యక్షీకరణ శక్తికి చక్కని ఉదాహరణలు. 'బారాత్'లో పెట్రొమాక్సు పట్టుకుని, జీవచ్ఛవంలా నడుస్తున్న 'యాదమ్మ' సొమ్మసిల్లి పడిపోయిన హృదయ విదారక సన్నివేశం ఈ కవితను చదివే ప్రతి పాఠకుడికి తప్పకుండ యాదికుంటుంది.

''ఒంట్లో ప్రాణం తప్ప పాలు లేక
పసివాణ్ని ఇంట్లోనే వదిలేసి
దొర ఇస్తానన్న డబ్బులతో
గంజైనా త్రాగవచ్చునని
ఆశతో వచ్చిన యాదమ్మ'' అన్న పంక్తులు కన్నీళ్లు తెప్పిస్తాయి

సహృదయుడికి.

మృత్యువు విశ్వరూపాన్ని చిత్రించిన వైనం కూడా సహజ రమణీయంగా ఉంది.

''నవసౌరభాల నందనవని''గా, ''నవరసాల బృందావని''గా ప్రపంచానికే శాంతి సందేశ సౌరభాలను పంచిన మన దేశం ఈనాడు మారణహోమంగా విషమించి వికటించడానికి గల కారణం - మితిమీరిన స్వాతంత్ర్యం. మతిపోయిన రాజకీయం, సరిహద్దులు దాటిన స్వార్థం, హింసావాదం, ధనదాహం, పదవీ

వ్యామోహం అని వివరించారు ఈ కవి. మాతృదేశాన్ని పీడించే ఈ సమస్యలకు పరిష్కార మార్గాలు కూడా సూచించారు - బాధ్యతతో :

"మనిషిని మనిషి ప్రేమించినప్పుడు
మనిషి మానవతకు మణిమకుటం పెట్టి పట్టం కట్టినప్పుడు"

భరతమాత బాధలు తీరిపోతాయన్నారు.

పచ్చని మొక్కలపై పూలు ఎంత స్వభావసుందరంగా మెరుస్తుంటాయో ఈ సంపుటిలోని ప్రతి శీర్షికలో కొన్ని పంక్తులు సువర్ణకవితా రేఖల్లాగా వ్యాఖ్యాన గర్భితంగా ప్రకాశిస్తున్నాయి.

"మీ నవ్వుల గనిలో
నన్నొక వజ్రపు ముక్కను చేశారు
మీ అందాల సామ్రాజ్యంలో
నన్నొక రాజును చేశారు" ('రెండు శోకతీరాల మధ్య' లో)

శిశువు తల్లిదండ్రులతో పలికిన పలుకులివి. తల్లిదండ్రులు పసిపాపను ఎంత ప్రేమతో చూచుకున్నారో పై పంక్తుల్లోని రూపకాలు నిరూపిస్తున్నాయి. అలాగే—

"మా అందాన్ని చిదిమి దీపం పెట్టినవాళ్లం"
"విధి విసిరేసిన వెలుగురవ్వలం
రాలిపడిన మబ్బుతునకలం" ("మేం శాపగ్రస్తులం" లో)

అన్న మూడు పంక్తులు పేదకార్మికుల త్యాగశీలాన్నీ, సేవాభావాన్నీ, లోకహితైక దృష్టినీ శక్తిమంతంగా చాటుతున్నాయి.

"మృత్యువు ఒకసారి ప్రభాతగీతమవుతుంది
ఇంకొకసారి బృందగానమవుతుంది" ("మృత్యువు ఒక విరామగీతం" లో)

అన్న చరణాలు మృత్యువు అకాల ఆగమనాన్నీ, సామూహిక మరణ సన్నివేశాన్నీ ధ్వనిమంతంగా ప్రకటిస్తున్నాయి. 'శోకతీరాలు' చక్కని రూపకం.

"ఈ విశాలవిశ్వం
నగరంలోని అద్దెకొంపలా
ఇంత ఇరుకైపోతున్న దేమిటి?" అనే పంక్తిలోని ఉపమానం సహృదయ హృదయంగమం.

శ్రీ మురళీధర గౌడు తాత్త్వికుడూ సౌందర్యారాధకుడూ.

"నువ్వు చూడనిదొక్కటే
అది నీ మరణం

మృత్యువు - "ఒక నగ్న సత్యం - ఒక యుగధర్మం—
ఒక విరామగీతం"-అని అనివార్యమైన మృత్యుశక్తిని సూక్తిసుందరంగా నిర్వచించడంలోనూ - "జీవితం సుదర్పణం" "జీవితం అమృత భాండం" ''జీవితం - ఒక మనోహర దృశ్యకావ్యం"— అని జీవితాన్ని సంభావించడంలోనూ మురళీధర గౌడు అంతరంగంలోని తత్త్వపరిమళం, మానవ జీవన సౌందర్య దృక్కోణం ప్రస్ఫుటమవుతున్నాయి.

సమకాలిక సమాజ సంస్కరణాభిలాషియైన శ్రీ మురళీధర గౌడుగారు ఉదాత్తాశయమహితంగా సూక్తి ప్రాయంగా ఉపదేశం చేశారు ఇలా సోదరులకు-

"హంసలా బ్రతుకడం నేర్చుకో"
"దీపంతో మరొక దీపాన్ని వెలిగించినట్లు
జీవితంతో మరొక జీవితాన్ని వెలిగించు"
"ప్రతీ మనిషీ ఒక మహాత్ముడు కావాలి"
''అడుగడుగునా మానవతా మందిరాలు నిర్మించాలి''
''శాంత్యహింసల కేతనాలు ఎగురవేయాలి"

ఈ కావ్యకర్త జాతిసమైక్యవాది. మన ఈ స్వతంత్ర భారతం మహనీయ త్యాగధనుల జీవితాల బలి ఫలితమని జ్ఞాపకం చేస్తూ—

"ఏకత్వంలో భిన్నత్వం కాదు
భిన్నత్వంలో ఏకత్వాన్ని దర్శించు" అన్నాడు.

ఈనాడు మనకు అత్యావశ్యకమైంది దేశ సమగ్రత అని చక్కగా గుర్తుచేశారు - గౌడుగారు.

ఇలా - సహజ సరళ సుందరమైన తనదైన ఒక శైలితో, మానవ జీవన వాహినిలో అప్పుడప్పుడు అక్కడక్కడ ఆవేశంలా తరగెత్తిన ప్రశ్నపరంపరకు ఆలోచనలా ప్రశాంతంగా సాగిపోయే సమాధాన ధారను చూపుతూ చక్కని ఈ కవితా సంపుటిని అందించినందుకు సహకవీ సత్కవీ అయిన శ్రీ మురళీధర గౌడుగారిని అభినందిస్తున్నాను. ముందు ముందు వారు అమందానంద సంధాయకాలైన కమనీయ కావ్యాలు అనేకం రచించాలని ఆకాంక్షిస్తున్నాను.

23-10-1994

# సూచిక

# ప్రశ్నార్థకాలు

వాళ్లు—
రాళ్లు కొడతారు
ఇండ్లు కడతారు
బంగ్లాలు నిర్మిస్తారు
కానీ - చరిత్ర కెక్కరు

వాళ్లు—
భూముల్ని దున్నుతారు
పంటలు పండిస్తారు
పశువులను మేపుతారు
కానీ - పస్తులుంటారు

వాళ్లు—
దివారాత్రులు యజమానిని సేవిస్తారు
కంటికిరెప్పలా కాపాడుతారు
చివరకు కన్నీరవుతారు
కానీ - కంటికి కునుకన్నది ఎరుగరు

వాళ్లు—
చెట్లు గీస్తారు
బట్టలు నేస్తారు

ప్రభుత్వ ఖజానా నింపుతారు
కానీ - చాలీచాలని జీతాలతో కడుపుమాడ్చుకుంటారు

వాళ్లెప్పుడూ చీకటిలోనే వుంటారు
వెలుగుకోసం నిరీక్షిస్తారు
నిరీక్షణలోనే జీవితాలను గడిపేస్తారు
వాళ్లు వాళ్లకే ఆశ్చర్యార్థకాలు
మనకు నిత్య ప్రశ్నార్థకాలు.

రచనాకాలం: **17-07-1989** ప్రచురణ: ఆంధ్రప్రభ దినపత్రిక **01-07-1990**

# జనారణ్యం

ఇది జనారణ్యం -
బస్సుల హారన్లు ఆటోల చప్పుళ్ళతప్ప
అబలల ఆర్తనాదాలు
అన్నార్తుల ఆక్రందనలు వినిపించవు
వినిపించినా ఎవరూ పట్టించుకోరు
ఇక్కడి జనజీవనమే ఒక పరుగు
ఈ పరుగు పందెంలో
సామాన్యుడిదే ఓటమి

ఇక్కడ గుడిసెల పక్కనే
ఎత్తైన మేడలు
సామ్యవాదాన్ని సవాల్ చేస్తుంటాయి
ఆడవాళ్ల అర్ధనగ్నాలంకరణలు
పోటీలపేరిట అందాల ప్రదర్శనలు
నగర నవనాగరికతకు ప్రతీకలు

ఇక్కడ మనుషులు
మౌనంగా మాట్లాడుకుంటారు
సగటు మనిషి
తన దుఃఖాన్నీ ఆకలినీ
కన్నీటినీ కష్టాలనూ
తనలోనే దిగమింగుకుంటాడు

ఆశల రెక్కల్ని తనలోనే ముడుచుకుంటాడు
ఇక్కడ డబ్బుదే ఆధిపత్యం
ప్రతిదీ వ్యాపారమయమైన నగరంలో
మనిషి మాన ప్రాణాలతో సైతం
వ్యాపారం చేస్తారు

ఇక్కడి ప్రజలు
పక్క ప్లాటులోని దొంగతనం
పక్కగల్లీలోని హత్య మానభంగం
తెల్లవారి పత్రికలో చదువుకొని
ఆశ్చర్యపోతారు
అప్పుడే మరచిపోతారు

ఇక్కడ నవ్వడం ఏడ్వడం కృతకం
ఇక్కడి జీవితమే నరకం.

15-07-1989 ఆంధ్రప్రభ దినపత్రిక 07-10-1990

# నన్నిలా బతుకనీయండి

నా కనురెప్పలు రెంటినీ
నిర్దాక్షిణ్యంగా కత్తిరించనే కత్తిరించారు
నాలోని ఆశాంకురాలను
పాశవికంగా నలిపివేయనే నలిపివేశారు

ఇప్పుడు
కళ్లున్న కబోదిని
కాళ్లున్న కుంటివాణ్ణి
నేను చేసిన నేరమేమిటి?
నా శాపగ్రస్త జీవితానికి కారణమేమిటి?
ఎవరైనా చెప్పగలరా?
మీలో ఎవరైనా నా సమస్యల ముడి విప్పగలరా?
మీ రాజకీయాలకు నన్నెందుకు బలిచేస్తారు?
మీ స్వార్థానికి నన్నెందుకు గురిచేస్తారు?
ప్రభుత్వ మిచ్చే నష్టపరిహారం
ప్రజల సానుభూతి
నా వాళ్లను బతికించగలవా?
నా బతుక్కి వెలుగును అతికించగలవా?
చెప్పండి

అలా మౌనముద్రితులైనా రేమిటి?
నా కళ్లల్లో ఇంకిన
దుఃఖ సముద్రాన్ని దర్శించండి

నాలోనే దిగమింగుకున్న
ఆశయాల బడబాగ్నిని చూడండి
శకలాలు శకలాలుగా మారిన
నా స్వప్న సౌధశిథిలాలను చూడండి
చివరకు అంతా కలిసి
నన్నొక పావుగా వాడుకుంటారు
ప్రకటనలు గుప్పిస్తారు
పత్రికల్లో పతాకశీర్షికలవుతారు
నన్నొక ప్రచారసాధనంగా మార్చుకుంటారు
చివరకు అంతా మరచిపోతారు

ప్లీజ్ —
నన్నిలా బతుకనీయండి
మీ సానుభూతి శరపరంపరలతో
గాయపడ్డ నా హృదయాన్ని కెలకకండి.

01.06.1991 నందని మాసపత్రిక, అక్టోబర్ 1992

# రెండు శోకతీరాల మధ్య

నేను
పుట్టినప్పుడే చెప్పానుగదా నాన్నా!
'జీవితం దుఃఖమయ'మని
నా ఏడ్పును మీరు అర్థం చేసుకుంటేగదా
మీరు కేరింతలు కొడుతూ
నన్ను నవ్వించడానికి ప్రయత్నించారు
మీ నవ్వులగనిలో
నన్నొక వజ్రపుముక్కను చేశారు
మీ అందాల సామ్రాజ్యంలో
నన్నొక రాజును చేశారు
ఇప్పుడు నేను —
అర్ధాంతరంగా పోయానని ఎందుకేడుస్తారు?
అప్పుడు నేను ఏడిస్తే
మీరు నవ్వారు
ఇప్పుడు మీరు ఏడిస్తే
నేను నవ్వుకుంటున్నాను
అందుకే
జీవితం - రెండు శోకతీరాల మధ్య ప్రవాహం.

23-05-1993 నెలనెలావెన్నెల - 3, 1993

# మేం శాపగ్రస్తులం

అవును—
మేం శాపగ్రస్తులం
'బాంచెన్ కాల్మొక్తా' అని
నిత్యం మీ ఆజ్ఞకోసం
నిరీక్షించేవాళ్లం
మీ పొలాలను దున్నే పాలేరోళ్లం
నీళ్లు లేకుంటే
మా రక్తాన్ని సైతం నీళ్లుగామార్చి
ప్రవహింప జేస్తాం
మీ పశువులను మేపే జీతగాళ్లం
మా కడుపులను మాడ్చుకొనైనా
మీ గాదెలు నింపే నిస్వార్థజీవులం

అవును—
మేం శాపగ్రస్తులం
మీ పెద్ద పెద్ద బంగ్లాలు కట్టేది మేమే
అర్ధరాత్రిదాకా మీరు
పార్టీల్లో మజా చేస్తున్నా
కాలే కడుపులతో మీకోసం ఎదురుచూసేవాళ్లం
పీకలదాకా తాగిన మిమ్మల్ని
సురక్షితంగా ఇల్లుచేర్చి

ఇంటిముఖం పట్టే నిర్భాగ్యులం
పెళ్లాంబిడ్డల భవిష్యత్తుకోసం
మా సుఖసంతోషాలను
పణంగా పెట్టినవాళ్లం

అవును —
మేం శాపగ్రస్తులం
మా బాల్యాన్ని
హోటళ్లలో కార్ఖానాల్లో
పారేసుకున్నవాళ్లం
మనీ 'మనుషులకోసం'
మనీతో కొనబడ్డ మరమనుషులం
పనిమనుషులం మేం

అవును—
మేం శాపగ్రస్తులం
మీలో మాలిన్యాన్ని దాచుకున్నా
మీ మాసిన బట్టల్ని శుభ్రం చేస్తాం
మీ ఇళ్లు చిమ్మటంలోనో
మీ ఎంగిలి ప్లేట్లు తోమడంలోనో
గలీజును శుభ్రం చేయడంలోనో
మా అందాన్ని చిదిమి దీపం పెట్టినవాళ్లం

అవును—
మేం శాపగ్రస్తులం
రెక్కల్లో శక్తిలేకున్నా
మీ లావుపాటి శరీరాలను రిక్షాలో లాగుతాం
మీరేమో హాయిగా నవ్వుకుంటూ
ఆనందిస్తారు
మేమేమో రక్తాన్ని చెమటగా మార్చుకుంటూ
అదృష్టాన్ని లాటరీల్లో పరీక్షించుకుంటూ
రోదిస్తాం

అవును—
మేం తరతరాల బానిస సంస్కృతికి వారసులం
రేపటిని గురించి ఆలోచించే తీరికలేదు
ఈ పూట గడిస్తే చాలు
చేతికందిన కష్టఫలం
ఎవరిపాలో కాకుంటే అదే పదివేలు
విధి విసిరేసిన వెలుగురవ్వలం
రాలిపడిన మబ్బుతునకలం
మాకు మీ సానుభూతి అక్కర్లేదు
మానవత్వంతో మమ్మల్ని మనుషుల్లా చూడండి అదేచాలు

01-06-1992

# మళ్లీ ఉదయం

సుదీర్ఘ రాత్రి తర్వాత
మళ్లీ ఉదయం
నవచైతన్యాన్ని నింపుకొని
కాంతిపుంజాన్ని పుక్కిలించే
ఉషోదయం
కీర్తిలా స్ఫూర్తిలా
మధురానుభూతిలా వచ్చే ఉషస్సు
ఒక భ్రాంతి కారాదు
సుదీర్ఘ రాత్రి ఒక జీవితకాలం కారాదు
కొంతమందికి పగలుకూడా రాత్రే
మరికొంతమందికి రాత్రి అనేదే లేదు.

20-03-1988

# ఇది నా దేశమేనా?

నా దేశం
ఒకప్పుడు నవసౌరభాల నందనవని
నా దేశం
ఒకప్పుడు నవరసాల బృందావని
ఇక్కడినుంచే ప్రపంచానికి
శాంతిసందేశాలు పంపించిన దేశం
ఇక్కడి నదీనదాలుకూడా పవిత్రమైనవి
త్యాగానికి మరోరూపాలు
తుఫానులను కూడా తట్టుకొని
నిశ్చలంగా నిలబడివున్న చెట్లుకూడా
మొక్కవోని శౌర్యానికి
నిక్కమైన ప్రతినిధులుగా నిలిచిపోయినవి

మరి ఈనాడు
దేశంలో రక్తపుటేరులు
మతమూఢుల చేతిలో మారణహోమాలు
తుపాకీగుండ్లకు అమాయికుల గుండెల్ని బలిచేస్తూ
అరాజకశక్తుల వికటాట్టహాసాలు
ఇది నా దేశమేనా?
ఇది నా గేహమేనా?

20-03-1988

# కొత్తసంతకాలు

పుట్టినపుడు నువ్వు
మంచి ముత్యానివే
కాలప్రవాహంలో కొట్టుకొనిపోతూ
స్వార్థపంకిలం అంటుకొని
అనురాగద్వేషాలకు బానిసవై
దిగజారిపోతున్న మనిషీ!
దీపంలో శలభమైపోతున్నావు
విచక్షణజ్ఞానాన్ని కోల్పోయి
విర్రవీగుతున్నావు
చరిత్రహీనుడవై
చర్వితచర్వణజీవితాన్ని గడుపుతూ
'ఇదే జీవితం' అని అనుకుంటున్నావు
మనిషీ!
నీ మార్గాన్ని మార్చుకో
హింసావాదాన్ని వీడి
హంసలా బ్రతకడం నేర్చుకో
శాంతిమార్గంలో సాగాలి నీ పయనం
పాతజీవితానికి చెల్లుచీటీ వ్రాసి
కొత్తజీవితం ప్రారంభించాలి
శాంతిసేతువును నిర్మించే ఒప్పందంపై
కొత్తసంతకాలు చేద్దాం

మనిషిని మనిషి ప్రేమించే
సరికొత్త సమాజాన్ని నిర్మిద్దాం
అసూయాద్వేషాలు కనిపించని
అసలైన వాతావరణాన్ని సృష్టిద్దాం
చరిత్రలో సామ్రాజ్యాలు సైతం
కాలగర్భంలో కలిసిపోయిన వైనం
ప్రపంచంలోని సిరిసంపదలన్నీ
కనుమరుగై పోతున్న నిజం
నిత్యం ప్రేమించబడే అద్భుత సౌందర్యరాశులు
క్షణాల్లో మసియైపోతున్న సత్యం
మరచిపోతున్నావా?
నువ్వేమి సాధిద్దామని
తుఫానులను సృష్టిస్తున్నావు?
భూకంపంలాంటి యుద్ధవాతావరణాన్ని వర్షిస్తున్నావు?
భయంనీడలో తలదాచుకుంటున్న
ప్రజానీకాన్ని చూడు
బాల్యంలోనే వృద్ధాప్యాన్ని చవిచూస్తున్న
దీనజనులను చూడు
ఆకలితో అలమటించే
అన్నార్తులను చూడు

రక్తాన్ని స్వేదబిందువులుగా మార్చే
శ్రామికజనలోకాన్ని చూడు
జీవితం విలువ తెలుస్తుంది
పక్షి నేలకూలి గిలగిలా కొట్టుకుంటే
అది చూసిన వాల్మీకి గుండె ద్రవించి
కమనీయ కావ్యమే అయింది
రోగపీడితులనూ
జరాభార తాడితులనూ చూసిన
రాకుమారుడు బుద్ధుడైనాడు
భావితరాలకు
మానవతాసందేశాన్నందించాడు
నువ్వెందుకు మరి
రాక్షసుడవౌతున్నావు?
రానున్న తరాలకు
ఇనుపతెరలు దించుతున్నావు?
మళ్లీ శాంతిసంగీతంతో
ఈ నేలంతా పునీతం చేద్దాం
మనిషి మనుగడకోసం
మానవతాగీతాలను గానం చేస్తూ
కొత్త గాయకులమౌదాం.

25-11-1990

# నైజం

నీకు తెలుసు—
'జీవితం క్షణభంగురమని'
అయినా ఆకాశ హర్మ్యాలు కావాలి
ఎక్కడానికి అందలాలు కావాలి
పదవులు కావాలి
సన్మానాలు కావాలి
ఇవి సాధించడానికి
పడరానిపాట్లూ పడతావు

నీకు తెలుసు—
నిన్న 'రేపు' లేదు
రేపు 'నేడు' వుండదు
అయినా
కాలాన్ని బంధించాలని తాపత్రయం

నీకు తెలుసు —
జీవితం కృతకమని
అయినా దాన్ని వెర్రిగా ప్రేమిస్తావు
మేడిపండులో పురుగులు వుంటాయని తెలుసు
అయినా దాన్ని తినడం మానుకోవు

నీకు తెలుసు—
ధర్మమే జయిస్తుందని
సత్యమే శాశ్వతమనీ
అయినా అధర్మానికి వంతపాడుతావు
నింగినీ నేలనూ కలిపేద్దామని
విశ్వప్రయత్నం చేస్తావు

నీకు తెలుసు -
'జాతస్య మరణంధ్రువ'మని
అయినా
మృత్యువును జయించాలని నీ ప్రయత్నం
ఏది ప్రియమైందో అది అప్రియమైందనీ
ఏది నశ్వరమని భావిస్తున్నావో అది క్షణికమనీ
ఏది అందమైందో అది శత్రువనీ
ఏది మధురమైందో అదే విషమనీ నీకు తెలుసు
అయినా
నీ నైజగుణాన్ని మార్చుకోవు
రాగద్వేషాల కతీతుడవైతే
రాణిస్తావని తెలుసు
మనిషివి మనీషివైతే
మాననీయుడవౌతావని తెలుసు
అయినా నీ నైజగుణాన్ని మార్చుకోవు
అందుకే నీవింకా మనిషివే
మనీషివికాదు.

**18.02.1990**

# ఇరుకుగది

ఈ విశాలవిశ్వం
నగరంలోని అద్దెకొంపలా
ఇంత ఇరుకైపోతున్నదేమిటి?
మానవజాతంతా ఒక్కటేనని
మహాత్ములు ఘోషిస్తున్నతరుణంలో
మహనీయులు ప్రవచిస్తున్న సమయంలో
ఈ విశాలప్రపంచం
ఇంత ఇరుకైపోతున్నదేమిటి?

విశ్వాంతరాళ రహస్యాలు ఛేదించి
మానవుని మనుగడకోసం
పరిశోధనలు సాగుతున్న ఈ వేళ
కులమతాల అడ్డుగోడలు నిర్మించుకుంటూ
కుత్సితాలతో కుతంత్రాలతో కాలం గడిపేస్తూ
ఈ విశ్వమే ఒక ఇరుకుగదిలా
కుంచించుకుపోతున్నదేమిటి?
ఆత్మను వంచించుకుంటున్నదేమిటి?

25-11-1990

# చరిత్రశిథిలాల్లో

'మానవతకు ప్రతీక మనిషి' అనీ
మంచితనానికి వారసుడనీ
మహోన్నత మానవతామూల్యాలకు ప్రతిబింబమనీ
ఇన్నాళ్లూ భ్రమపడ్డాను

కానీ-
ఈ మనిషిలో ఇంత ద్వేషమా?
ఇంత అజ్ఞానాంధకారమా ?
ఇంత రాక్షసత్వమా ?
సజీవంగా నిలువునా దహించే
అమానుషత్వమా ?
రాతియుగంనాటి సంస్కృతిని తలపించే
ఈ అనాగరిక చర్యలు
ఆవేదనకు గురిచెయ్యడం లేదా ?
జీవితం అందమైంది
దాన్ని శకలాలు శకలాలుగా చెయ్యడం
అవివేకం
జీవితం సుదర్పణం
ముక్కలుముక్కలుగా మార్చడం
అనాగరికం
జీవితం అమృతభాండం

అందులో విషబిందువులను చిలికించడం
అజ్ఞానం
జీవితం ఒక మనోహరదృశ్యకావ్యం
చూసి ఆనందించే అభిరుచిని పెంపొందించుకోవాలి
అందాన్ని అనుభవించే అర్హత పెంచుకోవాలి

కాని-
ఇప్పుడు ఎక్కడచూసినా యుద్ధోన్మాదం
ఎవరిని గమనించినా
యుద్ధానికి సన్నద్ధమవుతున్న సంరంభం
ఎక్కడ విన్నా రాబందుల రెక్కలచప్పుడు
ప్రతిరోజూ ఎక్కడో ఒకచోట
ఈ ధరిత్రి రక్తంతోనో కన్నీటితోనో తడిసిపోతూంది
ప్రతిదినం మృత్యువుతో తెల్లవారుతూంది

మనిషిగా ఎప్పుడో గతించిన మనిషి
మానవత్వానికి అంత్యక్రియలు చేస్తున్నాడు
ప్రపంచాన్నొక శ్మశానవాటికగా మార్చి
రాజ్యమేలుదామనుకుంటున్నాడు
శాంతినీ మనశ్శాంతినీ
కొనుక్కుందామనుకుంటున్నాడు

అంగట్లో దొరికే వస్తువులని భ్రమిస్తున్నాడు
ప్రపంచాన్ని చుట్టివచ్చినా దొరకనిది శాంతి
జీవితాన్ని త్యాగంచేసినా లభించనిది మానవత్వం
మానవతామూల్యాలు లేని జన్మ సాధించేదేమిటి?
మనిషిని మనిషే విశ్వసించని దౌర్భాగ్యం
యుగయుగాల సంస్కృతిని నేలమట్టంచేసి
కొత్తయుగాన్ని ఆవిష్కరించాలని కలలుకంటున్నాడు

కాని -
కలలు కల్లలై
కాలగర్భంలో కలిసిపోతాడు
చరిత్రశిథిలాల్లో శిథిలంగా మారిపోతాడు
అప్పుడు చరిత్ర సానుభూతి కూడా చూపదు.

**02.02.1993**

# అవివేకి

ఘనీభవించిన పేదవాడి కన్నీరు
నీ కీర్తికిరీటంగా వెలుగుతూనేవుంది
అయినా నీకు తృప్తిలేదా?
నువ్వెంత అవివేకివి!
క్షణకాలంలో అదృశ్యమయ్యే
స్వప్నం - జీవితం
అందమైన అబద్ధం - జీవితం
నోరూరించే మేడిపండు - జీవితం
నువ్వు మక్కువతో నిర్మించుకునే మేడలు
నువ్వు పెంచుకునే ఆశాసౌధాలు
ఒకరోజు పేకమేడలై కూలుతుంటే
నువ్వు కనే సుందరస్వప్నాలు
ఒక్కొక్కటే అందకుండా జారిపోతుంటే
ఒక్కొక్క క్షణమే
కాలచక్రంలో నలిగిపోతుంటే
వెర్రిగా నవ్వుకుంటావు
అయ్యో అని పరితపిస్తావు
ఇంత శ్రమ ధారపోసిందీ దేనికోసం?
ఇన్ని కృత్యాలు చేసిందీ ఎవరికోసం?
విధి వక్రించినరోజు
నీ చెయ్యే నీపై చేయి చేసుకుంటుంది

నీ కాళ్లే నీమాట వినవు
ఎవరిమీద నీ అజమాయిషీ?
ఎందుకు ఈ అధికారదర్పం?
గత అనుభవాలను పాతిపెట్టి
కొత్తపాట పాడుతున్నావు
కొంగ్రొత్త నినాదాలతో హోరెత్తిస్తున్నావు
జనజీవన స్రవంతిని కలుషితంచేస్తూ
సంకుల సమరానికి నాందీ పలుకుతున్నావు
ఏది నీ మార్గం?
ఎటు నీ పయనం?
ఏమిటి నీ ఆదర్శం?
అన్నీ ఆక్రమించుకోవాలనే
అత్యాశల అశ్వాలకు కళ్లెం వేయి
సాటివారిని ఆదుకోవాలనే
సద్వివేకాన్ని అలవరచుకో!
చరిత్రలో చిరకీర్తిని పొందుతావు
సకలజనుల జేజేలు అందుకుంటావు.

04-02-1992

# వంచన

జీవితం ఒక మేడిపండైనప్పుడు
మనిషి ప్రతిచర్యా ఒక వంచనాశిల్పమే
జీవితాంతం ఏలుకుంటానని బాసచేసి
కట్టుకున్నవాడు
అర్ధాంతరంగా పోయినా
ఆగ్రహించి అగ్గిపుల్లగీసినా
అదీ మోసమే
తళుకుబెళుకులతో
కృతకమైన సౌందర్యాలతో
తన్మయులను చేయడం ఒక వంచనే
లిప్తకాలంలో లుప్తమయ్యే జీవితంపై
కొండంత ఆశలు పెంచుకోవడం
మనిషి తననుతాను దగా చేసుకోవడమే
క్షణకాలంలో అదృశ్యమయ్యే దృశ్యంపై
మక్కువచూపడం వింతైన విషయమే
అన్నీ ఆక్రమించుకోనాలని
అంతటా ఆధిపత్యం చెలాయించాలని
అడుగడుగునా సుడిగుండాలలో చిక్కుకోవడం
క్షమించరాని వంచన
వంచన అంటే
ఎదుటివాణ్ణి

నిలువునా దోచుకోవడమేకాదు
అర్హతనుమించి ఆశించడం
అందనివాటికోసం పాకులాడడం
ఔను—
వంచనకు ఎన్ని రూపాలు!
ఎన్నెన్ని మాయావలయాలూ!
వంచనలలోకెల్లా
ఆత్మవంచన అతిహానికరం.

30-01-1994

# మానవత్వం మరోసారి

ఆవేళ-
మృత్యువు విశ్వరూపందాల్చి
వికటాట్టహాసం చేసినవేళ
అక్కడ హృదయవిదారకంగా
చెల్లాచెదురుగా
విసరివేయబడిన మానవశకలాలు
మృత్యుశకలాలే
గమ్యమెక్కడో తెలియని వాళ్ల ప్రయాణాలకు
ఒక్కసారే ముగింపు

వాళ్లు-
ఏ పాపం చేశారనో ఈ కఠినశిక్ష!
మానవుని మనుగడకే విషమపరీక్ష
అభయప్రదాయిని భూమాతే
ఆగ్రహిస్తే దిక్కెవరు?
అన్నంపెట్టే అమ్మచేతులే
ఆయుధాలయితే రక్షించేదెవరు?
శిథిలాలమధ్య చిక్కుకున్న నిస్సహాయులకు
చేయూత అందించాల్సిన చేతులే
వాళ్లను నిలువునా దోచుకుంటుంటే
మానవత్వం మరోసారి విలవిల్లాడిపోయింది

మానవేతిహాసంలో
మచ్చగా నిలిచిపోయింది
ఇది చూడలేని కర్మసాక్షి
కళ్లు మూసుకున్నాడు.

17-12-1993

# జీవితాన్ని వెలిగించు

ఓ మనిషీ!
దీపంతో మరొకదీపాన్ని వెలిగించినట్టు
జీవితంతో మరొకజీవితాన్ని వెలిగించు
విచక్షణారహితంగా
పశువులా ప్రవర్తించకు
మానవతకు తలవంపులు తేవద్దు
చరిత్రలో నీ స్థానం
సమున్నతం కావాలికాని
చరిత్రహీనుడవు కావద్దు
చరిత్రగతిని మార్చాలికాని
చరిత్రకు దుర్గతి పట్టించవద్దు.

17-07-1989 ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక, 24-02-1990

# మళ్లీ బాల్యం

ఈ లోకంలోని
కుళ్లుకూ కుత్సితాలకూ అతీతంగా
అమాయికంగా నవ్వుతూ
ఆనందంగా కేరింతలుకొట్టే
పసితనం కోరుకుంటున్నాను మళ్లీ

మోసం దగా అనే
పదాలే తెలియని
అజ్ఞానిని కావాలని
ఆశిస్తున్నాను మళ్లీ
అమ్మ కొడితే
అప్పుడే మరచిపోయి
ఆమెచేతిఅన్నం ముద్దకోసం
ఏడ్చే బాల్యం కావాలి మళ్లీ

కులమతాలు
తరతమభేదాలు
అసలే తెలియని
స్వచ్ఛమైన పసితనం కావాలి మళ్లీ.

**20-03-1988**

# నువ్వు

బ్రతుకుగొంగడిలో భోంచేస్తూ
జీవితరణరంగంలో
సమస్యలసాయుధులతో పోరాడుతూ
రణసంగీతాన్ని వింటున్నాను
కమ్మనికలలతోపాటు
దుస్స్వప్నాలను కంటున్నాను
మధురస్మృతులతో పాటు
చేదు అనుభవాలనూ
హృదిలో పదిలపరచుకుంటున్నాను
కాలంవెంటసాగే
బతుకుపయనంలో
అనుభవాలే మైలురాళ్లు
అనుభూతులే గుర్తులు
నువ్వు కనిపించినప్పుడు
ఎడారిలో ఓయాసిస్సులా
పోయేప్రాణం లేచివస్తుంది
కమ్మగా వినిపించినప్పుడు
బతుకుపై మమకారం పెరుగుతుంది.

16-03-1988

# మేడిపండు

ఒక నవ్వువెనుక
వెయ్యివిషపునాగుల విషాన్ని
ఒక నిజంవెనుక
వెయ్యి అబద్ధాలనూ దాచుకొని
జీవించేది జీవితం
ఈ జీవితంవెనుక ఎంత విషాదం!
ఈ కళ్లవెనుక ఎన్ని కన్నీళ్లు!
ఈ తీపికలలవెనుక ఎన్ని చేదుఅనుభవాలు!
అందుకే జీవితం
ఒక మేడిపండు
అది ఒక అందమైన అబద్ధం.

06-11-1988

# కాలమా !

ధనవంతులనూ, దరిద్రులనూ
దైవాంశసంభూతులనూ దైవోపహతులనూ
నిష్పక్షపాతంతో నీలో కలుపుకుంటావు
అందుకే నీకు జోహారు
బంధుప్రీతి ఆశ్రితపక్షపాతం
అసలే లేవు
ఎవరి సిఫార్సులను లెక్కచేయవు
కాలం చెల్లినతర్వాత
పొడిగింపు ఇవ్వవు
నీ విధిని విధిగా నిర్వహించడమే
నీకు తెలిసిన నీతి
రాజకీయాల ప్రసక్తిలేదు
ఎవరితోనూ రాజీపడే ప్రశ్నేలేదు
అందుకే నీకు జోహారు
మానవత్వాన్నే మరచి
మరో మనిషిని నిలువుదోపిడీచేస్తూ
నిర్లజ్జగా జీవించే మనిషినిచూసి
నీలోనువ్వే నవ్వుకుంటున్నావా?
అవును
చివరకు అన్నీ నీలో లీనమవడమేకదా!

గగనాన్ని చుంబించే హర్మ్యాల్లో నివసిస్తూ
అట్టహాసం ప్రదర్శించే మానవుడు
ఎప్పుడో ఒకప్పుడు
నీకు లొంగిపోవాల్సిందేనన్న నగ్నసత్యాన్ని మరిచాడు
కన్నీటికి కరిగిపోవు
కాకమ్మకథలనూ కల్పనలనూ పట్టించుకోవు
నిన్ను మించిన న్యాయమూర్తి లేడు
అందుకే నీకు నా జోహారు.

06-11-1988

# కవిహృదయం

నేస్తం!
నా గుండె సవ్వడులను విన్నావా ఎప్పుడైనా?
సముద్రంలోని బడబాగ్నిలా
పీడితప్రజల దుఃఖాన్ని
నా గుండెలో దాచుకున్నాను
ప్రతిసంఘటనకూ స్పందించే నేను
కోట్లాదిమంది ఆక్రందనలను
నాలో దాచుకున్నాను
నా కలంతో పోరాటం సాగిస్తున్నాను
అనాదినుంచి జరుగుతున్న
అన్యాయాలను ఖండిస్తూ
కవితాధార కురిపిస్తున్నాను
హృదయాన్నొక రుద్రవీణచేసి ప్రమోగిస్తున్నాను
ఇది కవిహృదయం
ప్రజాకవిహృదయం
విప్లవదీపం వెలిగిస్తూ
కాంతికవాటాలు తెరుస్తున్నాను.

06-11-1988

# బారాత్

బారాత్ సాగుతూంది
కళ్లు మిరుమిట్లుగొలిపే వెలుగులతో
బాజాభజంత్రీలతో
బారాత్ సాగుతూంది
ఆధునికసంగీతానికి అనుగుణంగా
కుర్రకారు వెర్రినృత్యాలతో
బారాత్ నడుస్తూంది
తమ దారిద్ర్యాన్ని తమలోనే దాచుకొని
అరువుతెచ్చుకున్న సిరులతో
కృతకమైన సింగారాలతో

దొరకొడుకు పెళ్లికి వెళ్లనివాళ్లెవరు
పిలిచినవాళ్లూ పిలువనివాళ్లూ
అందరూ అక్కడ హాజర్
తాము తెచ్చిన కానుకలతో
దొర దృష్టిలో పడాలని
అతిథులు చేస్తున్న హడావుడి
అంతా ఇంతా కాదు
ఆ సంరంభం చూస్తుంటే అనిపిస్తుంది
'దారిద్ర్యం ప్రపంచంలో వుందా' అని
'కరువు రక్కసి రెక్కలు విరిచేశారా' అని

బారాత్‌ను కెమెరాలు వీడియోలు బంధిస్తున్నాయి
దొరగారి దొరతనం గురించి
ఆయన ఐశ్వర్యం గురించి
ఔదార్యం గురించి దాతృత్వం గురించి
గొప్పగా చెప్పుకుంటున్నారు
ఎలా సంపాదించాడో కాదు
ఎంత సంపాదించిందీ
ఎంతెంత ఖర్చుపెడుతున్నదీ
పొగడుతున్నారు

అదే బారాత్‌లో పెట్రోమాక్సు పట్టుకొని
నీరసంగావున్న యాదమ్మమాత్రం
వీటన్నింటికీ అతీతంగా
జీవచ్ఛవంలా నడుస్తున్నది
ఆమె కట్టుకున్నబట్టలు
శరీరాన్ని పూర్తిగా కప్పలేకపోతున్నాయి
మాసినబట్టలు ఆ దీపాల కాంతిలో
సిగ్గుపడిపోతున్నాయి
కడుపునిండా పట్టెడు అన్నం తిని ఎన్ని రోజులైందో?

ఇంట్లో జ్వరంతో మంచంపట్టిన
పనికి వెళ్ళలేకపోయిన మగడు
ఒంట్లో ప్రాణంతప్ప పాలులేక
పసివాణ్ణి ఇంట్లోనే వదిలేసి
దొర ఇస్తానన్న డబ్బులతో
గంజైనా తాగవచ్చునని
ఆశతో వచ్చిన యాదమ్మ పాపం
పెట్రోమాక్సు మోస్తూ నడుస్తూ నడుస్తూ
సొమ్మసిల్లి పడిపోయింది
అయినా బారాత్ సాగిపోతున్నది
కదిలించే ఈ హృదయవిదారక సన్నివేశం
అక్కడ ఎవరినీ కదిలించడంలేదు
విచిత్రమైన ప్రపంచంలో
వింతైన మనుషులతో
మానవత్వం కనుమరుగైన ఆ చోట
బారాత్ సాగుతూన్నది.

15-07-1989

# మహాత్ములు మళ్లీ పుట్టాలా?

మహాత్ములు మళ్లీ పుట్టాలా
మారణకాండలు ఆపడానికి
మహాత్ములు మన ఎదయెదలో గూడుకట్టుకోవాలా
మనస్సులు మార్చడానికి
మనిషిని చూస్తే మనిషికి
ఇంత ద్వేషమెందుకు బాబూ?
మానవతను అవమానిస్తూ
అమానుషత్వాన్ని అందలమెక్కిస్తూ
కాలంగడపడమే నీ ధ్యేయమా?
రక్తాన్ని దానంచేయాలి కాని
రక్తతర్పణంకాదు
హింస జయిస్తుందని
ఆశిస్తున్నావా మనిషీ!
అహింసతోనే ప్రపంచాన్ని జయించవచ్చని
గతచరిత్ర చెప్పిన గుణపాఠాలు మరిచావా?
నీ నడవడిని మార్చుకో
మనిషివై పుట్టినందుకు
సాటిమనిషి మనుగడకోసం
జీవితకాలాన్ని వెచ్చించు
త్యాగంలోవున్న మాధుర్యాన్ని
మహిమనూ పదిమందికీ పంచు

మహాత్ములు మళ్లీమళ్లీ పుట్టాలని ఆశించకు
ప్రతి మనిషీ ఒక మహాత్ముడు కావాలి
విశ్వాన్ని ఒక శాంతినికేతనం చేయాలి
అడుగడుగునా మానవతామందిరాలు నిర్మించాలి
శాంత్యహింసలకేతనాలు ఎగురవేయాలి.

**17-07-1989**

# నాలుగు శతాబ్దాల నగరం

నాలుగు శతాబ్దాల నగర మీ భాగ్యనగరమని
గర్వపడడం లేదు
నరుడు నరుడుగా జీవించలేనందుకు
బాధపడుతున్నాను
సిగ్గుతో కుంచించుకుపోతున్నాను
పాపం పుణ్యం తెలియని
పసిపాపలకు కసాయికత్తుల కరచాలనం
చంటిదాని ఆకటికోసం
కర్ఫ్యూసైతం లెక్క చేయక
పాలకోసం పరుగెత్తిన తల్లికి
పాశవికంగా బిడ్డనుండి ఎడబాటు
బిడ్డలపోషణకోసం
బిక్కుబిక్కుమంటూ
రోడ్డుమీదికొచ్చిన
కన్నతండ్రి గుండెల్లో
కత్తుల స్వైరవిహారం!
నీ గొప్పతనాన్ని ఏమని ప్రశంసించను?
గులాబీలు అమ్మే అంగడిలో
కన్నెగులాబీల అమ్మకాలు
స్వేచ్ఛగా తిరగాల్సినవాళ్లను

నాలుగు గోడలమధ్య
నిర్బంధించి శాసించే నగరమా!
నీకో నమస్కారం!
నవనాగరికతతో
తళుకుబెళుకులతో
నర్తించే నీకో సలాం!
కాలేకడుపులను చేత్తోపట్టుకొని
నీదగ్గరికి తరలివచ్చే జనాన్ని చూస్తుంటే
గుండె చెరువవుతూంది
వాళ్లకు నువ్వందించే ఆహ్వానం
మతంరక్కసి ప్రేటు
ఒకవైపు ఏడేడు అంతస్థులమేడలు
మరోవైపు చీకటిగుడిసెలు
ఇదీ నీ సంస్కృతి!
ఇదీ ఇన్నేళ్లుగా సాధించిన ప్రగతి!

04.02.1992

# దేహం - దేశం

నశ్వరమైన దేహమంటే ఎంత ప్రేమ నీకు?
రక్తమాంసాలే కదా ఇందులో వున్నవి
దేహంపై ఈగకూడా వాలనివ్వవు
ఎక్కడ దెబ్బతగిలినా
విల్లవిల్లాడిపోతావు
చిన్నపిల్లాడిలా ఏడుస్తావు
ఎందుకు మనిషీ!
నిన్ను నువ్వు అంతగా ప్రేమిస్తావు?

ఇంతవరకూ నీ దేహాన్నిగురించే ఆలోచించావు
ఇంతకన్నా విలువైన దేశం సంగతేమిటి?
సమస్యల సుడిగుండాల్లో చిక్కుకొని
విలవిల్లాడిపోతున్న దేశమాత సంగతి ఏమిటి?
నీటికోసం కూటికోసం
సాటిమనిషితో నిత్యం కలహిస్తూ
దేశసమగ్రతను దెబ్బ తీస్తున్నావు
మానవుని మనుగడకే ముప్పు తలపెడుతున్నావు
అలజడులతో అల్లర్లతో
దేశాన్ని మారణహోమం చేస్తున్నావు
అర్థంలేని ఆవేశంతో
గమ్యంలేని నడకతో

ఈ ధరిత్రిని రక్తసిక్తం చేస్తున్నావు
ఏమిటీ వైపరీత్యం?
ఏమైంది నీ విజ్ఞాన సర్వస్వం
దేశమంటే నీ దేహమేనని
ఎప్పుడైనా భావించావా?
అపురూపమైన దేహమే దేశం
భాషలు వేరైనా భావమొక్కటేనని
జాతులు వేరైనా నీతి ఒక్కటేనని
మతాలు వేరైనా మానవత్వమొక్కటేనని
సమైక్యగీతాలు పాడుతున్నాం
కవితాగానాలు చేస్తున్నాం
సభలు చేస్తున్నాం
సన్మానాలు పొందుతున్నాం
చప్పట్లు కొట్టించుకుంటున్నాం
శాంతికపోతాలు ఎగురవేస్తున్నాం
కానీ—
ఆచరించడం మరచిపోయాం
నీ దేహాన్ని ముక్కలు ముక్కలుచేస్తే భరిస్తావా?
ఈ దేశపటాన్ని చూడు
పగిలినఅద్దంలా ఎంత దయనీయంగా వుందో?

ఈ అద్దంలో నిన్ను చూసుకో
నీ నిజస్వరూపం తెలుస్తుంది
ముక్కలైన ప్రతిరూపాన్ని చూస్తే
హృదయం ద్రవించదా?
ఈ జనకీకారణ్యంలో
అబలల ఆర్తనాదాలు
అన్నార్తుల ఆక్రందనలు
నిన్ను కదలించడం లేదా?

మనిషీ!
ఈ రోజు నువ్వుంటావు
దేశం మాత్రం
నిన్న వుంది నేడు వుంది రేపూ వుంటుంది
నీకంటే దేశమెంత విలువైందో
ఇప్పటికైనా గుర్తుంచుకో
స్వార్థప్రయోజనాలకోసం
దేశాన్ని బలిచేయకు
ఎందరో త్యాగధనుల
జీవితాల బలిఫలితం ఈ దేశం
ఎందరో మహితాత్ముల
శ్రమఫలితం ఈ దేశం

ఏకత్వంలో భిన్నత్వం కాదు
భిన్నత్వంలో ఏకత్వాన్ని దర్శించు
రా నేస్తం!
భగ్నహృదయంతో ఏకాకిలా జీవిస్తావెందుకు?
నా స్నేహహస్తాన్ని అందుకో!
సజీవ జీవనస్రవంతిలో కలిసినడుద్దాం
మానవేతిహాసానికి సరికొత్త భాష్యం చెబుదాం
రాయివంటి హృదయంలో
రసజగతిని నిర్మిద్దాం
దానవతను రూపుమాపి
మానవతను పల్లకీనెక్కిద్దాం
తరతరాలకు చెరిగిపోని
సరికొత్త చరిత్రను సృష్టిద్దాం.

03-01-1992 హైదరాబాద్ దూరదర్శన్, జనవరి 1992

# పల్లె నా గుండె

పల్లె అంటే నాకు
వల్లమాలిన ప్రేమేకాని ద్వేషంలేదు
ఎందుకోమరి నన్నుచూసి పళ్లుకొరుకుతూంది!
కన్నెర్రజేస్తూంది!

బ్రతుకుదెరువుకోసం
నగరానికి వలసపోయినవాణ్ణేకాని
పల్లెపట్ల ద్వేషంతోకాదు
నేను మాటనేర్చింది పల్లెబడిలోనే
బ్రతుకుపాట కూర్చింది ప్రకృతిఒడిలోనే
మట్టివాసనలు గుబాళించేది
పల్లెపట్టులోనే
మట్టిని శ్రీగంధంగా పూసుకున్నది పల్లెలోనే
పల్లె అంటే నాకు వల్లమాలిన మమకారమేకాని
ద్వేషంలేదు

నా బాల్యాన్ని
ఒక మధురస్మృతిగా మిగిల్చింది పల్లెనే
చెలికాండ్రతో ఆడుకున్న ఆ చెరువుగట్టూ
తిరిగి తిరిగి అలసిపోయిన నన్ను
సేదతీర్చిన ఆ చెట్టూచేమలూ

ఇంకా జ్ఞాపకచిహ్నంగా
అలాగే మిగిలిపోయాయి
మరి ఆ పల్లె -
ఇప్పుడు ఒక అగ్నిగుండం
మండుతున్న కొలిమి
కన్నతల్లి గుండెలా
తల్లడిల్లిపోతున్నది
పచ్చగా పరిమళించాల్సిన పల్లె
బీభత్సంగా మారుతూంది
ప్రతిఘటించే శక్తిలేక
ప్రతి సంఘటనకూ
చిగురుటాకులా వణికిపోతున్నది
ఎవరు బాధ్యులు?
ఎవరు సారథులు?
పల్లెలో ప్రతి చిన్నవిషయాన్నీ రాజకీయంచేసి
ఆడుకుంటున్న స్వార్థపరులు
శవాలతో వ్యాపారంచేసే ముష్కరులు

పల్లెప్రజలు ఈనాడు
తమ జీవితాలను
రంగులచిత్రంలో చూసుకుంటున్నారేకాని

అసలు జీవితాలు రంగువెలసిన వలువలు
కరెంటువెలుగుల్ని చూస్తున్నారే కాని
వారి జీవితాల్లో వెలుగులు శూన్యం
నగరానికీ పల్లెకూమధ్య
రహదారులు ఏర్పడ్డాయేకాని
మానవసంబంధాలు మెరుగుపడడంలేదు

అసలైన జీవితం
ప్రతిబింబించేది పల్లెలోనే
మానవత్వం విలువలకు అద్దంపట్టేది పల్లె
పల్లె నాకేకాదు
దేశానికి గుండె
బ్రతుకుపాటకు పల్లవి
రుగ్మతకులోనైన ఈ గుండెకు
శస్త్రచికిత్స జరగాలి.

29-08-1993

# భయారణ్యం

ఇది జనారణ్యం
భయానక అరణ్యం
ఇక్కడ పులులూ సింహాలూ
తోడేళ్లూ ఖడ్గమృగాలూ
మనుషుల్ని మింగడానికి సిద్ధంగా వుంటాయి
మానవరూపాల్లో
స్వేచ్ఛగా సంచరిస్తూ వుంటాయి
ఇది భయారణ్యం
వరకట్న పిశాచాలూ
కామరూప రాక్షసులూ
స్వైరవిహారం చేస్తుంటాయి

పసిమొగ్గలను సైతం
పాశవికంగా నలిపేసి ఆనందించే
బ్రహ్మరాక్షసులకు కొదువలేదు
ఇక్కడ మృత్యువు మనలను అనుసరిస్తూ వుంటుంది
ఏ వాహనరూపంలోనో వచ్చి కబళించవచ్చు
మనమెంత జాగరూకత వహించినా
మోసకత్తెలూ మోసగాళ్లూ
తమ మాయాజాలంతో బంధిస్తారు
మాటలగారడీతో మోహితుల్ని చేస్తారు

ఈ కారడవిలో నయవంచకులెందరో!
హితులనుకున్నవాళ్లే
మాటల బాణాలతో గుండె గాయంచేయవచ్చు
సన్నిహితులే ప్రమాదాల ఊబిలో పడవెయ్యవచ్చు

ఈ భయారణ్యంలో
అవినీతిదే ఆధిపత్యం
సగటుమనిషిని ముక్కలు ముక్కలుచేసి
ఇక్కడి విపణిలో బేరసారాలు చేస్తారు
రక్తమాంసాలనూ ఘర్మజలాన్నీ
చివరకు మానప్రాణాలను సైతం
సరసమైనధరలకు
కొని అమ్ముతూవుంటారు
ఇక్కడ నరమేధం
నిరాటంకంగా జరుగుతూవుంటుంది
ఇది జనారణ్యం
భయారణ్యం.

10.04.1994

# బతుకుపాట

నే నిప్పుడు
స్వాగత గీతమో
వీడ్కోలు పాటనో వినిపించడానికి రాలేదు
సుడులు సుడులుగా
నా మస్తిష్కంలో తిరుగుతున్న
భావాలను మీముందుంచుతున్నాను

ఇంతవరకూ
సముద్రాన్నే
ఒక సముద్రమనుకున్నాను
ఇప్పుడు
మనిషిలోని దుఃఖంకూడా
ఒక సముద్రమని తెలుసుకున్నాను

కుల మత రాజకీయాలతో
నగరాలకు నగరాలు
తగులబడిపోతుంటే
'ఇంకా మనం బ్రతికేవున్నామా'
అని ప్రశ్నిస్తున్నాను

ఒక వైపు సగటు మనిషి
ఆకలితో జీవితసమస్యలతో

అలమటిస్తుంటే
ఇంత విచ్చలవిడిగా
వినోదం పంచిపెట్టబడుతుంటే
'ఇదేమిన్యాయ'మని అడుగుతున్నాను

పథకాల ప్రలోభాలకు
ప్రజలను బానిసల్నిచేస్తున్న ప్రభుత్వం
నిరుద్యోగులకింత
'చిరుద్యోగమైనా చూపదేమిట'ని
విస్తుపోతున్నాను

నేనిప్పుడు ప్రియురాలిగురించో
ప్రేమికుల గురించో
కావ్యం వ్రాయాలని ఉబలాటపడడంలేదు
నేస్తం!
నేనింకా కలువకన్నుల కన్నెలగురించి
వర్ణిస్తానని భ్రమపడబోకు
బతుకుపాట వినిపించాలనుకుంటున్నాను
బతుకుబాట గురించి ముచ్చటించాలని
ఆరాటపడుతున్నాను

విస్తరిస్తున్న నగరాల్లో
నాగరిక సమాజాల్లో

కుంచించుకుపోతున్న మానవత్వం
'మానవేతిహాసాన్నే అపహాస్యంచేస్తున్నదేమిట'ని
వింతగా చూస్తున్నాను

'టాటా' 'బై బై' చెప్పి
బడికి వెళ్లిన చిన్నారి
ఎక్కడో శవమై తేలుతున్నప్పుడు
అత్యాచారానికి గురియైన అభాగిని
ఆత్మహత్య చేసుకున్నప్పుడు—
డబ్బుకోసం
మమకారంసైతం చంపుకొని
పసిమొగ్గలను
పసిడి నిగ్గులను
సప్తసముద్రాలూ దాటిస్తున్నప్పుడు—
మనమింకా శ్వాసిస్తున్నందుకు
సిగ్గుపడుతున్నాను
వస్తానని చెప్పి గడపదాటిన నాథుడు
తిరిగివచ్చేదాకా బిక్కుబిక్కుమంటూ
క్షణాలు యుగాలుగా లెక్కించే ఇల్లాలికి
ఏమని ధైర్యం చెప్పగలం?
ఆమెలోని అభద్రతాభావాన్ని
ఎలా దూరం చేయగలం?

నేనిప్పుడు రాజుల యుద్ధాల గురించో
రాణుల ప్రేమగాథలగురించో
ప్రియురాళ్ల జ్ఞాపకచిహ్నాల గురించో
నాటించిన చెట్ల గురించో
పెకిలించిన వంశవృక్షాల గురించో
వినిపించడంలేదు
నా వ్యధ వినిపిస్తున్నాను
సగటుమనిషి గాథ వినిపిస్తున్నాను
కన్నీరే కడలిగా పొంగుతున్న
సాటిమనిషి ఛాయాచిత్రాన్ని చిత్రిస్తున్నాను

నాకిప్పుడు—
సాగరసంగీతం వినిపించడం లేదు
జనఘోష తప్ప
నాకిప్పుడు—
కవిత్వం రుచించడం లేదు
బతుకుపాట తప్ప.

20-03-1994

# ఆధునిక నిర్వచనాలు

అధ్యక్షుడంటే—
సమయానికి సభకు రానివాడు
వేదికపై విజ్ఞానసర్వస్వమై వెలిగేవాడు
సహవక్తల సమయాన్ని హరించేవాడు

తెలుగువాడంటే—
మాతృభాషలో మాట్లాడనివాడు
పుస్తకాలు కొని చదువనివాడు
సాటి ఆంధ్రునితో నిత్యం కలహించేవాడు

కవి అంటే—
కనిపించేవాడు వినిపించేవాడు
రాసిందల్లా వినిపించాలని ఉబలాటపడేవాడు
శ్రోతలులేకున్నా మైకు వదలనివాడు

నాయకుడంటే—
అరచేతిలో స్వర్గాన్ని చూపేవాడు
నాదగ్గరేముందని బుకాయించేవాడు
పదవీవిరమణ లేనివాడు

చప్పట్లు కొడితే—
ఇంకా వినిపించమనికాదు
చప్పగా వుందని భావం
'ఇకచాలు ముగించమని' అర్థం

ఉపన్యాసమంటే —
శ్రోతల ఓర్పును పరీక్షించడం
అంశాన్ని గాలికి వదిలేయడం
ఎదుటివాళ్లను అజ్ఞానులుగా జమకట్టడం

నటనంటే—
వీలైనంత వల్గర్‌గా నటించడం
ద్వంద్వార్థాలతో చిత్రవధ చేయడం
ప్రేక్షకుల సహనాన్ని పరీక్షించడం

మానవత్వమంటే—
పసిపిల్లలు 'అమీనా'లుగా విదేశాలకు ఎగిరిపోవడం
అమాయికులు నగరంలో శవాలుగా మారడం
పెళ్లికూతుళ్లు కట్నపిశాచాల చేతుల్లో బలికావడం

మతమంటే—
మసీదులనూ మందిరాలనూ కూల్చివేయడం
మానవతకు సమాధికట్టడం
మానువుల మనుగడను ఛిన్నాభిన్నంచేయడం

పెళ్లంటే—
మూణ్ణాళ్ళముచ్చట
కన్నెపిల్లల కలలకు ఫుల్‌స్టాప్
వరకట్నపు చావుకు ప్రభాతగీతం.

రాజకీయమంటే—
రోజుకోరంగు మార్చడం
ప్రత్యర్థుల తలలు మార్చడం
అనవసర విషయాల్లో తలదూర్చడం

జీవితమంటే—
ఒక యుద్ధరంగం
జీవన్మరణ సమస్యల చదరంగం
స్వాభావిక చలనచిత్రం

సన్మానమంటే—
పరస్పర ప్రశంసలకు చక్కనిఅవకాశం
సుదీర్ఘ ఉపన్యాసాలకు సువర్ణావకాశం
సభికులను చిత్రవధచేయడానికి అపూర్వఅవకాశం

స్వాతంత్ర్యమంటే—
విశృంఖలత్వం
ప్రత్యర్థులను నిర్దాక్షిణ్యంగా తుదముట్టించడం
నడిచేరైళ్లనూ బస్సులనూ సజీవంగా దగ్ధంచేయడం

స్వేచ్ఛ అంటే—
భార్యల్నిమార్చడం
భర్తల్నిమార్చడం
విచ్చలవిడిగా జీవించడం

ఎన్నికలంటే—
రిగ్గింగ్ చేయడం
అన్ని నియమనిబంధనలకూ నీళ్లువదలడం
వాగ్దానాలతో హోరెత్తించడం

ధర్మాసుపత్రులంటే—
అవినీతికి నిలయాలు
భూలోక నరకకూపాలు
నిర్దయకు మారురూపాలు

బడ్జెట్ అంటే—
ధరలు పెరగడం
సామాన్యుడి నడ్డి విరగడం
పేదవాని ఆశలపందిరి కూలిపోవడం.

సామ్యవాదమంటే—
ధనవంతుడు మరింత లావెక్కడం
బంగ్లాలపక్కనే పూరిగుడిసెలు వెలవెలబోవడం
పేదవాడు మరింత చిక్కిపోవడం.

ఏప్రిల్, 1992

# మానవతకు మణిమకుటం

ఈ పుణ్యభూమిపై
మానవత్వం క్షణక్షణం
మరణిస్తూ జీవిస్తూంది

తల్లిగా ఇల్లాలుగా
సోదరిగా సహధర్మచారిణిగా
కూతురుగా కోడలుగా
అనేక రూపాంతరాలుచెంది
మనిషిజన్మ కొక సార్థకతను కలిగించి
జీవనాధారమై జీవితమై
చివరకు మోడై
కాలచక్రంలో
కనుమరుగైపోయే స్త్రీ
చీకటిబజారులో అంగడిబొమ్మగామారి
శలభంలాగా కాలిపోతున్నప్పుడు

కామాంధుల కౌగిట్లో మలినమై
క్షణికావేశానికి పూవులా నలిగిపోతున్నప్పుడు
కారుణ్యం కనుమరుగైనప్పుడు
కాళ్లపారాణి ఆరకముందే
కట్నం డబ్బులకోసం
సజీవదహనమైనప్పుడు
మానవత్వం మరణించింది.

నడిచేరైలు కదిలేమృత్యువై
నరులను దహించినప్పుడే—
అబలల మానప్రాణాలను
హరించినప్పుడే—
నీతి నేలపాలైంది
మానవత్వం నిలువునా
మసియైపోయింది

ఒళ్లంతా రాళ్లుగా మార్చుకొని
భూరిపర్వతాలతో పోటీపడి
తోటిసోదరులకు రోడ్లనూ
ఏడంతస్థుల మేడలనూ
నిర్మించినా—
కరిగినకండకు ఖరీదు దొరకనప్పుడు
మానవత్వం సిగ్గుతో తలవంచుకుంది

ముక్కుపచ్చలారని పసిపిల్లలు
ఎవరి ఆనందంకోసమో
ఎవరి ఆస్తికోసమో
జరిగే చదరంగంలో
పావులుగా మారినప్పుడు

విలవిల్లాడుతూ ఆ చిన్నారులు
విదేశాలకు ఎగుమతి అవుతున్నప్పుడు
మానవతకు మతిపోయింది
గతిదప్పి చతికిలబడిపోయింది

హాయిగా కడుపునిండా తిని
ఆడుకునే ప్రాయంలో
కాలే గంజికూడా కరువై
ఆకటిచిచ్చుతో మండుతూ
కనిపించిన చెత్తకుండీల్లో
కాస్తోకూస్తో కనిపించే
మెతుకులకోసం
కుక్కలతో పోటీపడుతున్నప్పుడు
హోటళ్లలో కర్మాగారాల్లో గ్యారేజీల్లో
చిగురుచేతులు
నలిగిపోతున్నప్పుడు
నిరాశతో మానవత
నిట్టూర్పువిడిచింది

నడిబజారులో నడిచివెళ్లే
అమాయికప్రాణుల గుండెల్లో

కత్తులు గుచ్చుకొని
ఈ ధరిత్రి రక్తసిక్తమైనప్పుడే
మానవతాహత్య జరిగింది

చావుబ్రతుకుల్లో ఉన్న రోగి
చేయి తడపలేదని
కన్నెత్తికూడా చూడని మానవుడు
కర్తవ్యం మరచినప్పుడు
కరుణమాలినవాడైనప్పుడు
మానవత మరణవ్యాధి పాలైంది

మతం పేరిట కులం పేరిట
మానవుని మనుగడకే చిచ్చు అంటుకున్నప్పుడు
పన్నే కుటిల రాజకీయాల వ్యూహాలకు
అమాయికులు బలియవుతున్నప్పుడు
మానవత్వం వంచనతో కుంచించుకుపోయింది

ఈనాడు ఎవరికీ
పులులంటే భయంలేదు
కానీ
పూలన్నా పూలమాలలన్నా
పూబోడులన్నా భయం
ప్రాణంతీసే బాంబులంటే భయంలేదు

కానీ
ప్రాణం పోసే మనుషులంటేనే భయం
పాముపడగ నీడలో నిద్రిస్తున్న మనిషి
మృత్యువుకౌగిట్లో సేదతీర్చుకుంటున్నాడు
కలలఅద్దాలను పగులగొట్టి
ఆశయాలనిచ్చెనలు విరగ్గొట్టి
మృత్యువుముంగిట్లో
నిత్యం ఆడుకుంటున్నాడు

మానవత్వంకోసం
మనిషి మనుగడకోసం
స్వచ్ఛమైన స్వేచ్ఛకోసం
జాతికోసం నీతికోసం
మహాత్ములు త్యాగాలెన్నో చేసిన ఈ దేశానికి
ఈనాడు ఎలాంటి దౌర్భాగ్యం పట్టింది!
ఎందుకీ దురవస్థ ఏర్పడింది?
ఎందుకు? ఎందుకు?
ఎందుకా?
మితిమీరిన స్వాతంత్ర్యం
అతిగా అనుభవిస్తున్నందుకు
మతిపోయిన రాజకీయం

మనసారా కోరుకుంటున్నందుకు
సరిహద్దులుదాటిన స్వార్థానికి
స్వాగతం పలుకుతున్నందుకు
హింసావాదానికీ ధనదాహానికీ
పదవీవ్యామోహానికీ
మనిషి మరీమరీ దీనంగా బానిసగా అవుతున్నందుకు
స్వాతంత్ర్యం వచ్చిందని ఏటా
సంబరాలు చేసుకుంటున్నాం
భరతమాత దాస్యశృంఖలాలు తెగగొట్టామని
సభలు చేసుకుంటున్నాం
చరిత్ర తిరగేసుకుంటున్నాం

'నందనవని బృందావని' అని ఈ దేశాన్ని
అందంగా పొగడుతున్నాం
'సుజలాం సుఫలాం' అని
సుమధురంగా పాడుకుంటున్నాం
కానీ—
భరతమాత ఈనాడు
మన పొగడ్తలకు ఉప్పొంగిపోవడంలేదు
మన ఆనందంలో పాలుపంచుకోవడంలేదు

సజల నయనాలతో
సంక్షుభిత హృదయంతో
వేదనతో బాధలతో
విలవిల్లాడిపోతున్నది
మరి—
తల్లడిల్లే మన
తల్లిబాధలు తీరేదెప్పుడు?
తల్లిఎదలో ఉల్లాసం ఉదయించేదెప్పుడు?
మనగుండెలకు నిజమైనపండుగ ఎప్పుడు?
మనిషిని మనిషి గౌరవించినప్పుడు
మనిషిని మనిషి ప్రేమించినప్పుడు
మనిషి - మానవతకు మణిమకుటంపెట్టి
పట్టంకట్టినప్పుడు
కణకణంలో అణువణువులో
మానవకళ్యాణదీపాలు వెలిగేదెప్పుడు?
మమత అనురాగం పల్లవించి పూలుపూసే
మరో సమాజం
మనముందు నిలిచినప్పుడు
అప్పుడు - అప్పుడు - అప్పుడు.

30-07-1991

ఆకాశవాణి స్వాతంత్ర్యదినోత్సవ కవిసమ్మేళనం 15-08-1991

# మృత్యువు ఒక విరామగీతం

అనుక్షణం నువ్వు
మృత్యువును మరచిపోవాలని ప్రయత్నిస్తున్నావంటే
ఎప్పుడూ దానిని స్మరిస్తున్నావన్నమాటే
నువ్వు దూరంగా పారిపోవాలని
ఎంత ప్రయత్నించినా
నీకు చేరువవుతూనే వుంటుంది
మృత్యువును నువ్వెంత ద్వేషించినా
నీ స్పర్శకోసం తహతహలాడుతుంది

ఒక్కొకసారి పత్రికలనిండా విశ్వరూపం దాలుస్తుంది
నువ్వెక్కాల్సిన బస్సెక్కి
హారన్ మ్రోగిస్తుంది
విమానమెక్కి పోజుకొడుతుంది
రైలెక్కి కూస్తుంది
ఇంకోసారి ఏ వాహనమో ఎక్కి
నిన్ను అనుసరిస్తూ వుంటుంది
అంతా నీ భ్రమకాని
అసలు మృత్యువు
నిన్ను నీడలా వెన్నంటేవుంటుంది
నిన్నెప్పుడూ ఒక కంట
కనిపెడుతూనే వుంటుంది

మృత్యువు గూర్ఖా అవతారమెత్తి
నీ ఇంటికి కాపలా కాస్తూవుంటుంది
నీ మనసు ముంగిట నర్తిస్తూవుంటుంది
నీ ప్రాంగణంలో కల్లాపిచల్లుతూనో
పెరట్లో మొక్కలకు నీళ్లుపోస్తూనో
నిన్ను సేవిస్తూ వుంటుంది
మృత్యువు ఒకసారి ప్రభాతగీతమవుతుంది
ఇంకొకసారి బృందగానమవుతుంది
మందుపాతరైనా మారణహోమమైనా
అది మృత్యువు రూపాంతరమే
తుఫానైనా భూకంపమైనా
అది మృత్యువు ఛాయాచిత్రమే

నువ్వేమో వయస్సును దాస్తూ
ప్రజలను దోచేస్తూ
దినమొలతో నిర్లజ్జగా తిరుగుతూవుంటావు
అప్పుడప్పుడూ మృత్యువు నిన్ను పలుకరిస్తే
జలదరిస్తావు
వేదాంతి వవుతావు

విషాదగీతాలు పాడుకుంటావు
మళ్ళీ అప్పుడే అన్నీ మరచిపోతావు
నువ్వు చూడలేనిదొక్కటే
అది నీ మరణం
మృత్యువు విషాదగీతం కానేకాదు
అది ఒక మరణశాసనం
ఒక నగ్నసత్యం
ఒక యుగధర్మం
ఒక విరామగీతం.

17-06-1993

**PRASHNARTHAKALU** By Sri T. Muralidhar Gowd



శ్రీమతి తాళ్లపల్లి సూర్యాబాయి, శ్రీ సాంబగౌడు దంపతులకు దాదాపు నాలుగు దశాబ్దాల క్రితం జన్మించిన శ్రీ మురళీధర గౌడు స్వస్థలం ఆదిలాబాదు జిల్లాలోని లోనవల్లి గ్రామం. శ్రీ గౌడు బి.కాం. పట్టభద్రులు. వృత్తి సికింద్రాబాదులోని ట్రాన్స్‌పోర్ట్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా లిమిటెడ్‌లో. ప్రవృత్తి రచనా వ్యాసంగం. పాతిక సంవత్సరాలుగా సాహిత్య కృషి చేస్తున్న శ్రీ గౌడు అనేక సాహిత్య వ్యాసాలు, కవితలు, లలితగీతాలు వ్రాసి వివిధ పత్రికల్లో ప్రచురించారు హైద్రాబాదు ఆకాశవాణిలో, దూరదర్శన్‌లో ప్రసారం చేశారు. 1983 లో తొలికావ్యం 'వెలుగు రేఖలు' వెలువరించి, పలువురి మన్ననలు పొందారు. జంటనగరాల్లోని అనేక సాహిత్య సంస్థలతో సంబంధమున్న శ్రీ గౌడు 'యువభారతి' సంయుక్త కార్యదర్శి. మానవత మందహాసం చేసినట్లు నవ్వుతూ కనిపించే ఈ కవి సమాజ శ్రేయస్సుకోసం, సామాన్యుని అభ్యున్నతికోసం తపన పడతారు; కవిత్వంలో ప్రతిబింబిస్తారు. మనిషిలో మనీషిని దర్శించాలన్నది ఈ కవి ఆకాంక్ష.

a YUVABHARATHI Publication